# అబ్బో... ఎన్ని కళలో...

అతి తక్కువ కాలంలోనే అందరి దృష్టినీ తనవైపు తిప్పుకున్న అలియాభట్ ప్రస్తుతం యూత్ ఐకాన్. సినిమా నేపథ్యం ఉన్న కుటుంబం నుంచి (మహేష్‌భట్, సోనీరజ్దాన్‌ల కూతురు) వచ్చినప్పటికీ ఎక్కడా 'వారసత్వ' కార్డు ఉపయోగించకుండా కేవలం తన టాలెంట్‌తో టాప్‌లిస్టులోకి ఎంటరైన నటి ఆమె. విభిన్న కథాంశాలు ఎంచుకుంటూ స్టార్‌డమ్‌ను సంపాదించుకుంటున్న ఈ 23 ఏళ్ల యువ సంచలనం గురించి కొన్ని కొత్త విషయాలు...





ఆరేళ్ల వయసులోనే అలియాభట్ తనూజ చంద్ర తీసిన 'సంఘర్ష్' (1999)లో చిన్నప్పటి ప్రీతిజింటాగా నటించింది.

పెట్స్‌పై ప్రేమ ఎక్కువ. పిల్లులంటే పడి చస్తుంది. వాటితో సెల్ఫీలు దిగి ఇన్‌స్టాగ్రామ్‌లో పోస్ట్ చేస్తుంటుంది. తన పెంపుడు పిల్లి ఒకదానికి పోకేమాన్‌లోని పికాచూకు గుర్తుగా 'పిక్కా' అని పేరు పెట్టుకుంది.



అలియా ఒకప్పుడు బొద్దుగా ఉండేది. ఆమె మంచి ఫుడ్డీ కూడా. ఫ్రెంచ్ ఫ్రైస్, యోగర్ట్, కూల్‌డ్రింక్స్ అంటే చాలా ఇష్టం. అప్పుడప్పుడు రోడ్డు పక్కన గోల్‌గప్పాలను కూడా బాగా లాగిస్తుంది.

అలియా బెస్ట్‌ఫ్రెండ్ పేరు ఆకాంక్ష రంజన్. వారిద్దరూ కలిసి వివిధ సందర్భాల్లో దిగిన అనేక ఫోటోలను అలియా సోషల్ నెట్‌వర్క్‌లో పోస్ట్ చేస్తూ ఉంటుంది.



దర్శకుడు ఇంతియాజ్ అలీ తీసిన 'హైవే' సినిమాలో 'సూహా సాహా' పాటతో పాటు 'హమ్టీ శర్మ కీ దుల్హనియా', 'ఉడ్తా పంజాబ్', 'డియర్ జిందగీ', 'బద్రీనాథ్ కీ దుల్హనియా' సినిమాలలో కూడా పాటలు పాడి అందర్నీ ఆశ్చర్యపరిచింది.



అలియాలో ఒక చిత్రకారిణి కూడా ఉంది. చార్‌కోల్ పెయింటింగ్స్ చాలానే వేసింది. ఇక్కడ మీరు చూస్తున్నది ఆమె వేసిన మొదటి చార్‌కోల్ పెయింటింగ్.

తన తొలిచిత్రం 'స్టూడెంట్ ఆఫ్ ది ఇయర్'లో అవకాశం కోసం 400-500 మంది అమ్మాయిలతో పోటీ పడింది అలియా. బరువు తగ్గితేనే ఆ సినిమాలోని షనయా క్యారెక్టర్ ఇస్తాననే షరతు మీద కరణ్ జోహార్ ఆమెను ఎంపిక చేశారు. మూడు నెలల్లో 16 కిలోలు తగ్గాకే బాలీవుడ్‌లోకి ఎంట్రీ ఇచ్చింది.

# INSIDE





**క్యాంపస్ సన్యాసులు...**

నవతరం యోగులు- టెక్నాలజీని, ఆధ్యాత్మికతనూ కలబోస్తున్నారు. పాతకొత్తల మేలుకలయికకు ప్రతీకగా నిలుస్తున్నారు. సేవలోనూ దేవుడిని చూస్తున్నారు.

7



**శ్రీరాం వెదిరె**

కేంద్ర జలవనరుల మంత్రిత్వ శాఖ సలహాదారుగా ఉన్న శ్రీరాం వెదిరె అడుగులు సాఫ్ట్‌వేర్ నుంచి సాగునీటి రంగం వైపు ఎందుకు పడ్డాయి...

12

# మిత్రవాక్యం

పదిలక్షలు పెట్టి కొన్న కారుకు ఏ పాతికవేలో ఖర్చుచేసి బీమా చేయిస్తాం. యాభైవేలు కూడా ఖరీదు చేయని రిఫ్రిజిరేటర్‌కు ఓ వేయి రూపాయలు అదనంగా చెల్లించి మరీ జీవితకాల వారెంటీ తీసుకుంటాం. ప్రాణంలేని వస్తువుల మీద అంత మమకారం! మన దగ్గరికి వచ్చేసరికి నెలకో వేయి రూపాయలు మనవి కావనుకుని, టెర్మ్ పాలసీ తీసుకోడానికి కూడా ఒకటికి పదిసార్లు ఆలోచిస్తాం. ఏడాదికోసారి వైద్య పరీక్షలు చేయించుకోడానికి సైతం తెగ బద్ధకిస్తాం. రక్తపోటూ మధుమేహాలూ అదుపు తప్పుతున్నట్టు అర్థమౌతున్నా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తాం. మనకేమీ కాదన్న పిచ్చి నమ్మకం. 'మనిషి స్వభావమే అది. ఏదీ తన చేతిలో లేదని అతడికి తెలుసు. కానీ, అన్నీ తన కనుసైగతోనే నడిచిపోతాయని భ్రమపడతాడు' అంటాడు ధర్మరాజు మహాభారతంలో. అంతా చెడే జరుగుతుందని అనుకోవడం నిరాశ. అంతా మంచే జరగాలనుకోవడం



దురాశ. జీవితం మంచిచెడుల జుగల్బందీ! సుఖదుఃఖాల కాక్‌టెయిల్ పార్టీ. సరిహద్దుల్లోని సైనికుడిలా దేనికైనా సిద్ధంగా ఉండాలి మనం. ఆ సంసిద్ధతకు అక్షర రూపం ఇస్తే 'ప్రణాళిక' అవుతుంది. వానాకాలం తీసుకెళ్లే గొడుగు లాంటిది ప్రణాళిక. వర్షం వస్తే రక్షణ ఇస్తుంది. వర్షం రాకపోతే ధైర్యం ఇస్తుంది. సమయంలేదు మిత్రమా... ప్లాన్ చేసుకో! ■

## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

**◆ అమెరికాలో...**

ఈ వారం కవర్‌స్టోరీ 'అమెరికాలో అంతా క్షేమమేనా!' సందర్భోచితంగా ఉంది. పొట్టచేత పట్టుకుని బతుకు తెరువు కోసం అమెరికా వెళ్లేవారు ఆ రోజుల్లో... కాని ఇప్పుడు ఆ పరిస్థితి లేదు. 'మా వాడు అమెరికాలో ఉంటున్నాడ'ని గొప్పగా చెప్పుకోవడం కోసం పిల్లలకు ఇష్టం లేకపోయినా ఎయిర్‌బస్సు ఎక్కిస్తున్న తల్లిదండ్రులు ఎందరో ఉన్నారు. అలా అమెరికా వెళ్లిన మనవాళ్లు అక్కడ ఎదుర్కొంటున్న పరిస్థితులను ప్రవాస భారతీయుల మాటల్లో చక్కగా వివరించారు. కొందరు చేస్తున్న అతి వల్ల అనవసరంగా భయపడుతున్న తల్లిదండ్రులకు ఊరట కలిగించేలా ఉందీ కథనం.

**- ఎల్. ప్రఫుల్లచంద్ర,** ధర్మవరం

**◆ వారినేమనాలి?**

'నాలుగోతరం' కథ చాలా బాగుంది. ఇంటిని నడిపించే మగాడిని కర్తగా అభివర్ణిస్తుంది సమాజం. అయితే చాలామంది మగాళ్లు నామమాత్రపు కర్తలు మాత్రమే. ఏదైనా పని చేయాల్సి వచ్చినా, బాధ్యత నిర్వహించాల్సి వచ్చినా తప్పించుకుని తిరిగే మగాళ్లకు... తమ భారమంతా మోసే మహిళలంటే మాత్రం చులకన! భరించేవాడినే భర్త అంటారు మరి ఇలాంటి వారినేమనాలో?

**- ప్రకాష్,** వెల్లండ

**◆ అసలైన జ్ఞానోదయం**

"సమస్య అనుకుంటే సమస్య అవుతుంది. దాన్ని చూసి నవ్వడం నేర్చుకోండి. అప్పుడది సమస్య అనిపించకుండా పోతుంది" నాలుగోతరం కథలోని ఈ వాక్యాలే అసలైన జ్ఞానోదయం. అయితే ఇది, తనని తాను పరాయి వ్యక్తిగా భావిస్తే తప్ప సాధ్యపడని ఒక అభ్యాస ప్రక్రియ.

**- పి.వి. రామశర్మ,** విజయవాడ

**◆ నాన్నకు ప్రేమతో...**

'నాన్న కోసం నటనవైపు అడుగులు' అంటూ విజయ్ దేవరకొండ చెప్పిన విషయాలు చాలా బాగున్నాయి. ఎక్కడైనా పిల్లలు యాక్టింగ్ చేస్తానంటే తల్లిదండ్రులు వద్దంటారు. విజయ్ విషయంలో మాత్రం సీన్ రివర్స్. విజయ్ తన తండ్రి కోసం ఇండస్ట్రీకి వచ్చినా తనకంటూ ఒక ప్రత్యేక గుర్తింపు తెచ్చుకోవడం అభినందనీయం.

**- బైండ్ల అశోక్,** కృష్ణాపూర్

**◆ ప్రత్యేకం!**

ఫిల్మ్‌నగర్‌లో 'ఈ పిల్లలు ప్రత్యేకం' కథనం చాలా బాగుంది. సరోగసి ద్వారా బిడ్డలకు తల్లిదండ్రులుగా మారిన సెలబ్రిటీల విశేషాలు చదివి ఆశ్చర్యపోయాం. 'పేరెంటింగ్' శీర్షిక ద్వారా పిల్లల సమస్యలపై తల్లిదండ్రులకు అవగాహన కలిగిస్తూ, పరిష్కార మార్గాలు చూపించడం బాగుంది.

**- కవిత,** కరీంనగర్

# ‘కొత్త’గా ట్రై చేద్దాం!

**ఒక్కోసారి భావోద్వేగాలను పంచుకోవడానికి మనకు తెలిసిన భాషలో మాటలు దొరక్కపోవచ్చు. కొన్ని అనుభూతులను వ్యక్తం చేయడానికి పదాల కొరత ఏర్పడవచ్చు. నోరారా తిట్టడానికి తిట్లూ సరిపోకపోవచ్చు. కొన్ని సున్నితమైన వ్యక్తీకరణలకు పదజాలమే ఉండకపోవచ్చు. అన్నీ ఉన్నాయనుకున్నా.... మరెవరికీ తెలియని భాషలో మాట్లాడితే మిత్రబృందంలో ‘హీరో ఆఫ్ ద డే’ మనమే!**



**గిగిల్ (Gigil)**
కొన్నిసార్లు ప్రేమ ఎక్కువైపోయి గిల్లాలనిపిస్తుంది, ఓ మొట్టికాయ వేయాలనిపిస్తుంది. ఆ భావోద్వేగాన్ని ఒక్కమాటలో ‘గిగిల్’ అనొచ్చు. ఫిలిప్పీన్స్‌లో పుట్టిన ‘టాగాలాగ్’ అనే భాషలో ఉందీ పదం.



**షిమొమిజామో (Shemomedjamo)**
‘వంటకాలు అదిరిపోయాయి. అందుకే ఒక్క మెతుకూ మిగల్చకుండా లాగించేశాను. పొట్ట నిండిపోయిందనుకో’ - అసలే భుక్తాయాసం. అంతపెద్ద మాట చెప్పాలా? ఇదిగో ఇలా సింపుల్‌గా ‘షిమొమిజామో’ అనేయడమంతే!



**మెంచాలిక్ (Mencolik)**
వేడి వేడి టీని ‘ఉఫ్...ఫ్’ అని ఊదుకుంటూ తన్మయంగా తాగేస్తున్న స్నేహితుణ్ణి చూడగానే, ఆటపట్టించాలనిపిస్తుంది. కుడివైపున నిలబడి ఎడమ భుజంపై తడతాం. తను ఎడమవైపు తిరిగి చూస్తే ఎవరూ కనిపించరు. ఇలా చేయడాన్ని ఇండొనేషియన్ భాషలో ‘మెంచాలిక్’ అంటారు.



**కఫ్యూన్ (Cafune)**
చిరుగాలికి చెలి నుదుటిపై అలల్లా అలా అలా తేలియాడే ముంగురులను సవరిస్తుంటాడో ప్రేమికుడు. హెల్మెట్ తీయగానే చెదిరిపోయిన ప్రియుడి జుత్తును, తన మునివేళ్లతో సుతారంగా సరిచేస్తుందో ప్రియురాలు. ఆ ప్రేమ పూర్వక అభివ్యక్తిని ‘బ్రెజిలియన్ పోర్చుగీసు’ భాషలో ‘కఫ్యూన్’ అని ముద్దుగా పిలుస్తారు.



**బకి ముప్‌కి**
(Mbuki-mvuki)
‘బంటు’ అనే ఆఫ్రికన్ భాష నుంచి వచ్చిందీ పదం. పట్టలేని ఆనందం వస్తే, ఆ ఆనందంలో డ్యాన్స్ చేస్తూ ఒంటిమీదున్న షర్టు తీసి గిరాగిరా తిప్పి విసిరేయాలనే ఆపుకోలేని కోరిక కలిగితే... దాన్ని బంటుభాషలో ‘బకి ముప్‌కి’ అంటారు.

**సెనియర్ టెర్రసెస్**
(Seigneur-Terraces) : ఇరానీ హోటల్‌లో బల్ల దగ్గర ‘వన్ బై టు’ చాయ్ చెప్పి, గంటల తరబడి బాతాఖానీ కొడుతుంటాం. టేబిలు ఖాళీ చేస్తే ఒట్టు. ఫ్రాన్సులోనూ మనలాంటివారికి కొదవలేనట్టుంది. అక్కడి టీ షాపు యజమానులు ఆ బాపతువాళ్లను చూసి ‘సెనియర్ టెర్రెసెస్’ అని నసుగుతుంటారు.



**బ్యాక్‌ఫైఫెన్‌జెసిష్ట్**
(Backpfei fengesicht) : ‘కొడితే మొహం పచ్చడైపోద్ది’, ‘తేడా వస్తే ఫేసు షేపు మార్చేస్తా’... లాంటి తిట్లు సినిమాల్లోనూ, సీరియళ్లలోనే కాదు, నిజ జీవితంలోనూ వినిపిస్తుంటాయి. ఇలా చాంతాడంత డైలాగ్ చెప్పే పన్లేదు జర్మనీ వాళ్లకి. సింపుల్‌గా ‘బ్యాక్‌ఫైఫెన్‌జెసిష్ట్’ అనేస్తారు.



# జై చిరంజీవా...

**దైవమ్**

**హనుమంతుడు - బలవంతుడు, గుణవంతుడు, వినయవంతుడు. ఆత్మవిశ్వాసానికి ప్రతీక కూడా. ఆ సుగుణాల్ని వాల్మీకి మహర్షి రామాయణ మహాకావ్యంలో వేనోళ్ల కొనియాడాడు. చైత్రశుద్ధ పౌర్ణమి నాడు (ఏప్రిల్ 11) 'హనుమజ్జయంతి'.**

అంజన, కేసరి... హనుమంతుడి తల్లిదండ్రులు. అంజన వానరకాంతగా జన్మించిన అప్సరస. కేసరి మహాశక్తిమంతుడు. మాల్యవంత పర్వతం మీద కాపురం ఉండేవారా దంపతులు. ఆ సమయంలో శంబసాదనుడనే రాక్షసుడు మహర్షుల యజ్ఞయాగాలకు భంగం కలిగించేవాడు. ఆశ్రమవాసుల్ని అష్టకష్టాలకు గురిచేసేవాడు. దీంతో రుషులంతా వెళ్లి కేసరిని కలిశారు. రాక్షసపీడ విరగడ చేయమని వేడుకున్నారు. కేసరి ధాటికి శంబసాదనుడు నేలకూలాడు. కొంతకాలానికి కేసరి తనకో పుత్రుడిని ప్రసాదించమంటూ తపస్సు చేశాడు. ఆ భక్తికి మురిసిపోయిన వాయుదేవుడు పరమశివుడి తేజస్సును పండుగా ఇచ్చాడు. ఆ ప్రభావంతో అంజన కడుపు పండింది. ఆ బిడ్డే...అంజనీసుతుడు, వాయునందనుడు, కేసరీపుత్రుడు! బాల్యంలో కమ్మని పండేమో అనుకుని మండుతున్న సూర్యగోళాన్ని మింగబోయి, భానుడి చేతిలో చెంపదెబ్బ తిన్నాడా బాలుడు. దీంతో దవడ (హనుమ) ఉబ్బిపోయింది. అలా హనుమంతుడనీ అనిపించుకున్నాడు. హనుమంతుడు సాక్షాత్తు సూర్యభగవానుడి దగ్గరే విద్యాభ్యాసం చేశాడు. కాలచక్రంతో పాటు పరుగులు పెడుతూ సహస్రకిరణుడి దగ్గర సహస్రాధిక విద్యలు నేర్చుకున్నాడు. కిష్కింధ యువరాజులైన వాలి, సుగ్రీవులలో.... సహృదయుడైన సుగ్రీవుడికి అండగా నిలిచాడు హనుమంతుడు. ఆ సమయంలోనే శ్రీరామ పరిచయ భాగ్యం కలిగింది. సీతాన్వేషణకు ఆనతి లభించింది. అక్కడి నుంచి శ్రీరామపట్టాభిషేకం దాకా ... ప్రభువు వెనుక నీడలా నడిచాడు.

**కుడిభుజం....**

రామరావణ యుద్ధంలో హనుమంతుడిదే కీలకపాత్ర. త్రిశిరుడూ, ధూమ్రాక్షుడూ, నికుంభుడూ, అకంపనుడూ... ఇలా మహామహా రాక్షసుల్ని మట్టికరిపించాడు.

మహాభారతంలోనూ హనుమంతుడి ప్రస్తావన ఉంది. ద్రౌపది కోసం సౌగంధికా పుష్పాలు సేకరించడానికి వెళ్తున్న భీముడికి ముసలికోతిలా కనిపించి... వృకోదరుడిలో ఏమూలనో ఉన్న కాస్త అహాన్ని కూడా కరిగించాడు. కురుక్షేత్ర సంగ్రామంలో జెండాపై నిలిచిన కపిరాజు, పాండవ మధ్యముడిని కంటికి రెప్పలా కాపాడాడు. అలా, తాను ధర్మపక్షపాతినని నిరూపించుకున్నాడు హనుమ. ఓ దశలో శనీశ్వరుడంతటివాడినే ముప్పుతిప్పలు పెట్టి... ఆత్మవిశ్వాసంతో ప్రతికూల పరిస్థితుల్ని కూడా అధిగమించవచ్చని చాటిచెప్పాడు. సీతమ్మవారి జాడ కనిపెట్టలేకపోయాననీ, రాముడికిచ్చిన మాట నిలబెట్టుకోలేకపోయాననీ ఓ దశలో ఆత్మత్యాగానికి సిద్ధపడ్డాడు. అంతలోనే గుండెబలాన్ని పోగుచేసుకుని లక్ష్య సాధనకు ఉపక్రమించాడు. అతడిది మనో వేగం. 'మనోజవం మారుతతుల్యవేగం...' అని వర్ణిస్తారు రుషులు.

'మహీధరః మహాతేజః' ... అంటుంది రామాయణం. అంటే, హనుమంతుడు కొండలాంటివాడు, తేజో సంపన్నుడు. అదే సమయంలో... వినీతః చాలా అణకువగా ఉండేవాడు! అంతేనా, సంస్కార సంపన్నః గొప్ప సంస్కారం కలిగినవాడు కూడా. ప్రతిసూర్య ఇవోదితః - అంటూ ఉదయిస్తున్న సూర్యుడితో పోల్చింది రామాయణం. ఆ నమ్రత ఏపాటిదంటే.... తనకు సముద్రాలు ఓ లెక్క కాదని తెలిసినా...లంఘించే ముందు, వానర శ్రేష్ఠుల ఆశీర్వాదం తీసుకున్నాడు.

**మాటకారి మారుతి...**

హనుమంతుడి మాట మహా పొందికగా ఉంటుంది. వాల్మీకి మహర్షి 'వాక్య కోవిదః' అని కొనియాడాడు. 'వదతాం వర' ... వక్తల్లో శ్రేష్ఠుడని మెచ్చుకున్నాడు. ఆ మాటతీరు కారణంగానే తొలిపరిచయంలోనే రాముడి మనసు గెలుచుకున్నాడు. 'అర్థం మీద శ్రద్ధ ఉంచి రుగ్వేదాన్ని అధ్యయనం చేయనివాడికీ, యజుర్వేదాన్ని కంఠస్థం చేయనివాడికీ సామవేద జ్ఞానం లేనివాడికీ ఇలా మాట్లాడటం సాధ్యం కాదు. శత్రువు మనసునూ మార్చగలదా సంభాషణా చాతుర్యం' అని లక్ష్మణుడితో అంటాడు. మారుతి సచివోత్తముడు, చక్కని సలహాదారు. విభీషణుడు ఆశ్రయం కోరి వచ్చినపుడు, వానరముఖ్యులంతా ఆ ప్రతిపాదనను తిరస్కరించారు. ఒక్క హనుమ తప్ప! 'అతని మొహం నిర్మలంగా ఉంది. మాటల్లో దోషం లేదు. ముఖకవళికలతో మనసులోని భావాల్ని తెలుసుకోవడం సాధ్యమే. మన వర్గంలో చేర్చుకోదగినవాడు' అంటూ తూకమేసినట్టు సలహా ఇచ్చాడు.

రామాయణంలో హనుమంతుడి ప్రాధాన్యాన్ని వివరించే సంఘటన ఒకటుంది. శ్రీరామపట్టాభిషేక సమయంలో.... దేవేంద్రుడు వాయుదేవుడి ద్వారా రాముడికి ఓ ముత్యాలహారాన్ని కానుకగా పంపాడు. రాముడు దాన్ని సీతమ్మవారికి ఇచ్చారు. సీతమ్మ మారుతికి బహుమతిగా ఇవ్వాలనుకుంది. అనుమతి కోసం పెనిమిటి వైపు చూసింది. రామచంద్రుడు కాదంటాడా! ఆ దండలో రామాంజనేయుడు వెండికొండలా వెలిగిపోయాడు.

'దేహబుద్ధ్యా దాసోస్మి
జీవబుద్ధ్యా త్వదంశకః
ఆత్మబుద్ధ్యా త్వమేవాహం' ...

హనుమంతుడు - శరీర స్థాయిలో రాముడికి దాసుడు. ప్రాణస్థాయిలో రాముడిలో ఓ భాగం. ఆత్మస్థాయిలో తనే రాముడూ, రాముడే తను!





# మా అబ్బాయి హైపర్ యాక్టివా?

PARENTING

**ప్ర : నమస్తే మేడమ్. మాకిద్దరు అబ్బాయిలు. పెద్దవాడు సిక్స్ క్లాస్. చిన్నబ్బాయి థర్డ్ క్లాస్. సమస్యంతా చిన్నవాడితోనే. బాగా అల్లరి చేస్తాడు. కుదురుగా ఒక్కచోట కూర్చోడు. వాడి అల్లరి భరించలేక మధ్యాహ్నం బలవంతంగా నిద్రపుచ్చుతాను. రాత్రి ఎలాగూ మాతోపాటే లేటుగా పడుకుంటాడు. పొద్దున మాత్రం ఎంత లేపినా లేవకుండా స్కూలుకు ఆలస్యం చేసి మమ్మల్ని హైరానా పెట్టేస్తాడు. వాడి క్లాసు టీచరు మాతో 'మీవాడు హైపర్‌యాక్టివ్. నేను కంట్రోల్ చేయలేకపోతున్నాను. సైకాలజిస్ట్‌కు చూపిస్తే మంచిది' అంటున్నారు. నిజంగా మావాడు హైపర్‌యాక్టివా? అసలు హైపర్‌యాక్టివ్ అంటే ఏమిటి? కొంచెం వివరించగలరు? - బి.రాధిక, నెల్లూరు**

**జ:** నమస్తే. మీ సుదీర్ఘ ఉత్తరానికి సమాధానం కూడా వివరంగానే ఇస్తాను. యాక్టివ్‌గా ఉండటానికి, హైపర్‌యాక్టివ్‌గా ఉండటానికి తేడా ఉంది. ముందు మీ అబ్బాయి యాక్టివా? హైపర్‌యాక్టివా? అన్నది తెలుసుకునేముందు హైపర్‌యాక్టివ్ అంటే ఏమిటో చూద్దాం. 'హైపర్‌యాక్టివిటీ, అటెన్షన్' రెండూ ఒకదానికొకటి సంబంధం కలిగినవి. నిమిషం కూడా కుదురుగా కూర్చోకుండా అటు ఇటు పరిగెత్తడం, ఒకేసారి అనేక విషయాలపై దృష్టి పెట్టడం చేస్తుంటారు కొంతమంది పిల్లలు. వాళ్లకు దేనిపైనా ఏకాగ్రత ఉండదు. మూడు నిమిషాల్లో చుట్టుపక్కల వస్తువులను విసిరేయడం, కుర్చీల్లాంటి వాటిని తిరగేయడం వంటి పనులు చేస్తుంటారు. ఇవి హైపర్‌యాక్టివ్ లక్షణాల్లో కొన్ని. ఉదాహరణకు ఒక పిల్లాడికి రంగులు వేయమని క్రేయాన్స్ ఇస్తే, తను శ్రద్ధగా రంగులు వేస్తే నార్మల్ చైల్డ్‌గా భావించవచ్చు. కానీ మరో అబ్బాయి రంగులు వేయకుండా ఆ క్రేయాన్స్‌తో వేరే ఆటలేవో ఆడుకోవచ్చు. అలా అని ఆ అబ్బాయిని హైపర్‌యాక్టివ్ అని తేల్చేయలేం. తనేం ఆలోచిస్తున్నాడో, ఇంట్లో ఎలా ఉంటాడో, అలా ఉండటానికి కారణమేంటో తెలుసుకుని అన్నీ బాగానే ఉన్నా కూడా అబ్బాయి విపరీతంగా అల్లరి చేస్తుంటే అప్పుడు హైపర్‌యాక్టివ్ అని తేల్చి 'బిహేవియర్ థెరపీ' మొదలుపెడతాం. కొంతమంది పిల్లలు ఇంట్లో అతి గారాబం వల్ల బాగా అల్లరి చేస్తుంటారు. వీరిని హైపర్‌యాక్టివ్ గాటన కట్టలేం. 'హైపర్‌యాక్టివ్ చైల్డ్' అని మా దగ్గరకు తీసుకొచ్చే పిల్లల్లో 10 మందిలో 8 మంది 'యాక్టివ్ చిల్డ్రన్'. అందుకే ఒక అబ్బాయి లేదా అమ్మాయిపై తొందరపడి హైపర్‌యాక్టివ్ అనే ముద్ర వేయకూడదు.

ఇక మీ అబ్బాయి విషయానికొస్తే ముందు మీరు మధ్యాహ్నం బలవంతంగా నిద్రపుచ్చడం మానేయండి. మూడో తరగతి పిల్లలు స్కూల్లో మరీ ఎక్కువగా ఆటలాడి అలసిపోయే అవకాశం లేదు. కాబట్టి వాళ్లల్లో శక్తి పెద్దగా ఖర్చు కాదు. అందుకే నిద్రపుచ్చేబదులు డ్రాయింగ్ వేయడం, క్యారమ్స్ ఆడటం లాంటి ఇంటి పట్టున ఆడుకునే ఆటల్ని ఆడమనండి. ఇంటిపట్టున ఉంచమన్నారు కదా అని స్మార్ట్‌ఫోన్లూ ల్యాప్‌టాప్‌లూ ఇవ్వొద్దు. మీ అబ్బాయి అన్ని విషయాల్లోనూ చురుగ్గా ఉండేలా ప్రోత్సహించండి. మీవాడిలోని ఉత్సాహాన్ని సరైన మార్గంలో పెట్టేందుకు రకరకాల యాక్టివిటీస్‌తో బిజీగా ఉంచండి. అవకాశముంటే ఈతలో శిక్షణ ఇప్పించండి. సాయంత్రం ఎండ తగ్గాక తప్పనిసరిగా ఆరుబయట ఆడుకోమని చెప్పండి. శారీరక శ్రమతో కూడిన ఆటలు పిల్లలకు అవసరం. వాటి వల్ల శారీరక ఆరోగ్యంతో పాటు బుద్ధి కూడా వికసిస్తుంది. ఎదుటివారితో మాట్లాడటం, నిర్ణయాలు తీసుకోవడం, ఏ పనైనా ధైర్యంగా, సమర్థంగా చేయడం వంటి 'కాగ్నిటివ్ ఎబిలిటీస్' అభివృద్ధి చెందుతాయి. ఇప్పటి పిల్లలు ఆరుబయట ఆటలు ఎక్కువగా ఆడట్లేదు. దీంతో వారిలో 'కాగ్నిటివ్ ఎబిలిటీస్' లోపిస్తున్నాయి. మధ్యాహ్నం నిద్రను ఒకేసారి మానిపించకూడదు. క్రమక్రమంగా మొదటి వారంలో గంటన్నర, రెండోవారం గంట, మూడో వారం అరగంట, నాలుగో వారం పదిహేను నిమిషాలు, అయిదో వారం 'పవర్ న్యాప్' అంటే అయిదు నుంచి పది నిమిషాలు మాత్రమే నిద్రపోనివ్వాలి. మధ్యాహ్నం నిద్రపోకుండా ఉండటం వల్ల రాత్రిపూట త్వరగా నిద్రపోతాడు. పగలు త్వరగా నిద్ర లేస్తాడు. దానివల్ల స్కూలుకు ఆలస్యమౌతుందనే హైరానా ఉండదు. రాత్రి పడుకునే సమయానికి మూడు గంటల ముందే భోజనం పూర్తవ్వాలి. మూడు నెలల పాటు ఇదే టైమ్‌టేబుల్‌ని ఫాలో అయితే మీ అబ్బాయిలో మార్పు వస్తుంది.



**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్,
కిమ్స్ హాస్పిటల్

మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా ప్రశ్నలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.
**అడ్రస్ :** ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, **మెయిల్ ఐడి :** sunday.aj@gmail.com

# క్యాంపస్ సన్యాసులు



**ఆ యువకులు... సోషల్ నెట్‌వర్కింగ్ తెలిసిన వర్ధమాన మహావీరులు, ఆపిల్‌ఫోన్‌లో మాట్లాడే గౌతమ బుద్ధులు, లాప్‌టాప్‌తో లావాదేవీలు జరిపే ఆదిశంకరులు. నవతరం సన్యాసులు సర్వసంగ పరిత్యాగానికి సరికొత్త నిర్వచనం ఇస్తున్నారు. తమదైన రంగంలో నిశ్శబ్దంగా పనిచేసుకుపోతున్న జూనియర్ 'యోగి ఆదిత్యనాథ్'లపై ప్రత్యేక కథనం....**

క్రీస్తుపూర్వం ఆరో శతాబ్దం ప్రారంభం...

సిరిసంపదల్ని కాదనుకుని వర్ధమానుడు గడప దాటాడు.

క్రీస్తుపూర్వం ఆరో శతాబ్దం మధ్యలో...

రాజ్యాన్ని వద్దనుకుని గౌతమబుద్ధుడు అడవుల దారి పట్టాడు.

క్రీస్తుశకం ఎనిమిదో శతాబ్దం...

బంధాల్ని తెంచుకుని ఆదిశంకరుడు సత్యాన్వేషణకు బయల్దేరాడు.

20వ శతాబ్దానికి వచ్చేసరికి...

రాజ్యాల్లేవు.

కార్పొరేట్ సామ్రాజ్యాలున్నాయి.

నిధినిక్షేపాల్లేవు.

లక్షల జీతాల కొలువులున్నాయి.

వేదవేదాంగ విద్యల్లేవు.

ఐఐటీలూ ఐఐఎమ్‌ల చదువులున్నాయి.

అంతేనా, పబ్‌లూ పార్టీలూ ఊరిస్తాయి. బెంజ్‌లూ ఆడీలూ మురిపిస్తాయి. అందచందాలు ఆకర్షిస్తాయి. కొత్త అనుభూతులు కన్నుగీటతాయి. సంపాదన స్థిమితంగా ఉండనీయదు. నవతరం మహావీరులూ, గౌతమబుద్ధులూ... ఆ తళుకుబెళుకుల్ని గడ్డిపోచకింద లెక్కేస్తున్నారు. తోటి వాళ్లంతా ప్రేమలూ పెళ్లిళ్లంటూ వెంపర్లాడుతుంటే, డూప్లెక్స్‌లూ విల్లాలంటూ కలలు కంటుంటే, ప్రమోషన్లూ స్టార్టప్‌లూ అంటూ ఆరాటపడిపోతుంటే, తాముమాత్రం - సత్యాన్వేషణకో, సామాజిక సేవకో అంకితం అవుతున్నారు. ఆధ్యాత్మిక సాధనకు ఆటంకం లేకుండానే మేనేజ్‌మెంట్, బోధన, ఫొటోగ్రఫీ... ఇలా ఆసక్తి ఉన్న రంగాల్లో ప్రావీణ్యం సంపాదిస్తున్నారు. ఒక్కసారి కాషాయం కట్టుకుంటే - నేనూ నా వాళ్లూ అన్న జంజాటం ఉండదు. తరాలకు సరిపడా సంపాదించాలన్న ఆరాటం కనిపించదు. లక్ష్యమే సర్వస్వం అవుతుంది. పరిపూర్ణత వైపుగా ప్రయాణం మొదలవుతుంది. ఆ ఉద్దేశంతోనే... కొంతమంది యువకులు ఐఐటీలూ ఐఐఎమ్‌ల లాంటి ప్రతిష్ఠాత్మక విద్యాసంస్థల నుంచి నేరుగా ఆధ్యాత్మిక కేంద్రాలకు బయల్దేరుతున్నారు. ఆశ్రమవర్గాలు ఈ కుర్రాళ్లకు పెట్టుకున్న ముద్దుపేరు.... క్యాంపస్ సన్యాసులు. గతంతో పోలిస్తే, ఆ సంఖ్య పెరుగుతోందని వివిధ ఆధ్యాత్మిక సంస్థల గణాంకాలు చెబుతున్నాయి. రామకృష్ణమఠం, ఇస్కాన్, బౌద్ధ సంఘాలు- సత్యాన్వేషకులకు మార్గదర్శనం చేయడానికి చాలా వేదికలే ఉన్నాయిప్పుడు. నేరుగా ఏ హిమాలయాలకో వెళ్లి దీక్ష తీసుకుంటున్నవారూ లేకపోలేదు. ఇంతకుముందూ కష్టాలున్నాయి. ఇంతకుముందూ సుఖాలున్నాయి. కానీ ఇప్పుడే ఆ సంఖ్య పెరగడానికి కారణం?' - అని అడిగితే, 'వేడి ఓ స్థాయిని దాటాకే, బంగారం కరగడం మొదలవుతుంది. ఇప్పుడు జరుగుతున్నదీ అదే...' అంటారు హైదరాబాద్‌లోని రామకృష్ణ మఠానికి చెందిన ఓ స్వామీజీ.

అర్థం లేని పరుగు, గమ్యం లేని ఉరుకు, మితిమీరిన వస్తు వ్యామోహం, వెగటు పుట్టించే భోగలాలసత్వం... తరచి చూసేకొద్దీ, లోతుగా ఆలోచించే కొద్దీ... ఇదేదో ఉప్పునీటి దాహంలా అనిపిస్తుంది. ఎంత తాగినా దప్పిక తీరదు, కోరిక చావదు. జీవితానికి అర్థమూ, పరమార్థమూ ఇది కాదేమో అన్న సంఘర్షణ మొదలవుతుంది. ఆ అంతర్మథనం మరీ తీవ్రంగా ఉన్నవారు సన్యాసం దాకా వస్తున్నారు. అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘం.... ఇస్కాన్‌లో విశ్వవ్యాప్తంగా వందల మంది సన్యాసులున్నారు. ఆ అవకాశం కోసం ఎదురుచూస్తున్నవారి 'వెయిటింగ్ లిస్ట్' కూడా చిన్నదేం కాదు. 'ఆర్ట్ ఆఫ్ లివింగ్', 'ఈషా యోగ' తదితర సంస్థలూ యువ సన్యాసులకు





దిశా నిర్దేశం చేస్తున్నాయి. శ్రీశ్రీ రవిశంకర్ నేతృత్వంలోని 'ఆర్ట్ ఆఫ్ లివింగ్' ఆశ్రమంలో పూర్తికాల కార్యకర్తగా చేరుతున్నప్పుడు... దినేష్ జీని 'ఇంత తెలివైనవాడివి ఇలాంటి నిర్ణయం ఎందుకు తీసుకున్నావ్? ఎవరైనా లక్షణమైన కార్పొరేట్ ఉద్యోగాన్ని వదులుకుంటారా?' అని అడిగారట ఆత్మీయులు. 'మీమాట నిజం. నేను తెలివైనవాడ్ని కాబట్టే, ఈ నిర్ణయానికొచ్చా...' అని జవాబిచ్చారాయన చిరునవ్వుతో. తెలివితేటల్ని ఉద్యోగంతో, విజయాన్ని జీతంతో కొలిచే ఈ సమాజం... యువ సన్యాసుల నిర్ణయాన్ని ఆమోదించడానికి చాలా సమయమే పడుతుంది.

**సరికొత్త నాయకత్వం**

ఆధ్యాత్మికత అంటే అన్నింటినీ వదులుకోవడం కాదు. వదిలేసుకోవాల్సినవాటిని మాత్రమే వదిలేసుకోవడం- అహాన్నీ స్వార్థాన్నీ ఐహిక భోగాల్నీ. కాబట్టే, కాషాయం కట్టుకున్న తర్వాత కూడా, సర్వోత్తమానంద బోధన రంగం మీద మక్కువను వదిలిపెట్టుకోలేదు. ఇప్పటికీ, వివేకానంద యూనివర్సిటీ విద్యార్థులకు కంప్యూటర్ సైన్స్ పాఠాలు చెబుతారు. టెక్నాలజీ ప్రపంచంలో వచ్చే మార్పుల్ని నిశితంగా గమనిస్తారు. ఉత్తమ ఉపాధ్యాయుడిగా ఎంతోమంది విద్యార్థుల్ని ప్రభావితం చేస్తూనే ఉన్నారు. సర్వోత్తమానంద విలువల విషయంలో ఏమాత్రం రాజీపడరు. ఓసారి విద్యాసంస్థలోని కంప్యూటర్ ల్యాబ్‌లో పైరసీ సాఫ్ట్‌వేర్‌ను ఉపయోగిస్తున్నట్టు ఆయన దృష్టికి వచ్చింది. అంతే, 'మేధోచౌర్యం మహాపరాధం. అధికారిక సాఫ్ట్‌వేర్ కొనేదాకా... ల్యాబ్‌లో అడుగుపెట్టేదిలేదు' అని బల్లగుద్ది చెప్పేశారు.

శిరీష్ జాదవ్ అనే ఐఐటీ విద్యార్థి స్వామి సర్వోత్తమానందగా మారడం వెనుక సిద్ధార్థుడు బుద్ధుడైనంత నాటకీయతేం లేదు. 'ఫలానా సంఘటన అని చెప్పలేను కాని, అనేకానేక అనుభవాలు నన్ను ఇటువైపు నడిపించాయి' అంటారు సర్వోత్తమానంద. తల్లి రాయపూర్ ఇంజినీరింగ్ కాలేజీలో ప్రొఫెసరు. తండ్రి భిలాయ్ స్టీల్ ప్లాంటులో ఉద్యోగి. శిరీష్ అల్లరి పిల్లాడు. క్లాసులు ఎగ్గొట్టి మరీ హాకీ మ్యాచులకు వెళ్ళేరకం. ఒకటి రెండుసార్లు ఇంట్లో వాళ్ళకి దొరికిపోయాడు కూడా. అలా అని చదువుల్ని నిర్లక్ష్యం చేయలేదెప్పుడూ. ఏకసంథాగ్రాహిగా పేరు తెచ్చుకున్నాడు. ప్రవేశ పరీక్షలో జాతీయ స్థాయిలో రెండో ర్యాంకు సాధించి... ఐఐటీ కాన్పూర్‌లో సీటు తెచ్చుకున్నాడు. క్యాంపస్ జీవితం తన గురించి తాను ఆలోచించుకునే అవకాశం ఇచ్చింది. సమాజం గురించి ఆలోచనలు పంచుకోవడానికి ఓ వేదికగా నిలిచింది. తాను అందరిలాంటి వాడు కాదన్న సంగతి అర్థమైంది. సేవే జీవిత లక్ష్యమన్న నిర్ధరణకు వచ్చినా, అది ఏ రూపంలో అన్న విషయంలో మాత్రం... స్పష్టత లేదు. ఆ ఊగిసలాట మధ్యే బేలూరు రామకృష్ణ మఠానికి వెళ్ళాడు. మనశ్శాంతి కోసం మహా అయితే ఓ నెలరోజులు ఉండాలన్నది ఆలోచన. కానీ, శాశ్వతంగా అక్కడే స్థిరపడిపోయాడు. అలా, ఆశ్రమ జీవితం మొదలైంది.

పిల్లలేం చదవాలో, ఎలాంటి ఉద్యోగాలు చేయాలో చాలా సందర్భాల్లో కన్నవారే నిర్ణయిస్తారు. స్వామి విద్యానాథానంద (పూర్వాశ్రమంలో మహన్‌మిత్రా) జీవితంలోనూ అదే జరిగింది. అమ్మానాన్నలు పోరుపెట్టి మరీ ఖరగ్‌పూర్ ఐఐటీలో చేర్పించారు, అదీ అస్సలు ఇష్టంలేని ఎలక్ట్రానిక్ ఇంజినీరింగ్‌లో. ఆ తర్వాత ఎలాగోలా బ్రాంచి మార్చుకున్నాడు. పట్టా చేతికొచ్చాక, పై చదువుల కోసం కాలిఫోర్నియా యూనివర్సిటీకి వెళ్ళాడు. అక్కడే స్థిరపడాలనుకుంటే ఎన్నో అవకాశాలు. మహన్ మాత్రం వెనక్కి రావాలనే నిర్ణయించుకున్నాడు. 'ఐఐటీలో ఉన్నప్పుడే వివేకానందుడి సాహిత్యం చదివాను. ఆ విత్తనమే, విదేశాల్లో మొలకై మొక్కై చెట్టంత పెరిగింది' అంటాడు. ఆ స్ఫూర్తితోనే, వచ్చీరాగానే రామకృష్ణమఠానికి వెళ్లి సన్యాసం స్వీకరించాడు. విద్యానాథానందకు

'సాధువులు పాత జీవితాన్ని వదిలేస్తారు. పూర్వాశ్రమ బంధాల్ని తెంచుకుంటారు. మరి ఏ పాస్‌పోర్టులోనో తండ్రి పేరు? అన్న చోట ఏమని రాయాలి. ఆ గడి నింపక పోతే, దరఖాస్తు అసంపూర్ణం అవుతుంది. ఆ ఇబ్బందిని తొలగించడానికి ప్రభుత్వం నిబంధనల్ని మార్చింది. సన్యాసులు తండ్రి స్థానంలో ఆధ్యాత్మిక గురువు పేరు రాయవచ్చు'

'రామకృష్ణమఠం వెబ్‌సైట్ ప్రకారం సన్యాస దీక్ష తీసుకోవాలనుకునే వారి వయసు ముప్పైలోపే ఉండాలి. ఏదో ఓ పట్టా చేతిలో ఉండాలి. పరిపూర్ణ ఆరోగ్యవంతులై ఉండాలి. శరీర దారుఢ్య పరీక్షలో ఉత్తీర్ణులు కావాలి. కెరీర్‌నూ బంధాల్నీ వదిలేసుకోవాలి. గురువుల ఆదేశాలు పాటించాలి. ఐదేళ్ల ప్రొబేషన్ తర్వాత 'బ్రహ్మచారి' హోదా ఇస్తారు. ఇంకో నాలుగేళ్ల తర్వాత పూర్తిస్థాయి సన్యాసిగా మారడానికి అర్హత సాధిస్తారు. బ్రహ్మచారులకే ఈ అవకాశం'

'ద మాంక్ హూ సోల్డ్ హిజ్ ఫెరారీ... రాబిన్‌శర్మ రాసిన ఈ పుస్తకం ఇప్పటికీ బెస్ట్ సెల్లర్స్ జాబితాలో కనిపిస్తుంది. కథలో కోట్ల రూపాయల ఆస్తులున్న ఓ న్యాయవాది... జీవితంలోని డొల్లతనాన్ని తట్టుకోలేక, సన్యాసిగా మారిపోతాడు. అచ్చంగా ఇలాంటి కథే ఈమధ్య ఢిల్లీలో జరిగింది. దాదాపు ఆరువందల కోట్ల రూపాయల ప్లాస్టిక్ సామ్రాజ్యానికి అధినేత అయిన... రఘునాథ్ దోషి అన్నీ వదులుకుని జైన సాధువుగా మారాడు'

'ప్రధాని నరేంద్రమోదీ యువకుడిగా ఉన్నప్పుడు సన్యాసం తీసుకోవాలని అనుకున్నారు. రామకృష్ణమఠం ప్రతినిధులు ఆ ప్రతిపాదనను సున్నితంగా తిరస్కరించారు. అలా, మొత్తం మూడు ప్రయత్నాలు జరిగాయి. 'ప్రజా జీవితమే మీకు సరైంది' అని మోదీకి సూచించారు రాజ్‌కోట్ మఠానికి చెందిన స్వామీ ఆత్మస్థానానంద'



రేఖాగణితంలో భాగమైన జామెట్రిక్ టోపోలజీ అంటే మహాఇష్టం. ఈ విభాగం మీద పట్టున్న నిపుణుల్ని వేళ్ల మీద లెక్కపెట్టవచ్చు. ఓవైపు టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రిసెర్చ్‌లో ప్రొఫెసర్‌గా పనిచేస్తూనే, గణితం మీద పరిశోధనలు చేసుకుంటున్నారు. 'గణితంలో ఆధ్యాత్మికత' 'మెదడు- బుద్ధి- కంప్యూటర్' తదితర పుస్తకాలు రాశారు. 'ఎక్కడి గణితం, ఎక్కడి ఆధ్యాత్మికం? ఏమిటీ నిర్ణయం?'...అని చాలామంది నోరెళ్లబెడుతుంటారు. 'నాకు గణితమంటే ఇష్టం. ఆధ్యాత్మికత అంటే మరీ ఇష్టం. దేన్నీ వదులుకోలేను. సన్యాసిని అయితేనే రెండింటికీ న్యాయం చేయగలనేమో అనిపించింది. గణితమైనా, వేదాంతమైనా ప్రశ్నా పరంపరే. ఒకానొక కనిపించని అస్తిత్వాన్ని వెదికే ప్రయత్నమే' అంటారు విద్యానాథానంద. గణితంలో పరిశోధనలకు ప్రతిష్ఠాత్మకమైన శాంతిస్వరూప్ భట్నాగర్ అవార్డు వరించింది. ఇన్ఫోసిస్ ప్రైజ్ కూడా అందుకున్నారు. అదే సమయంలో, ఆధ్యాత్మిక సాధనలోనూ ఎంతో పురోగతి సాధించారు. ఆయన మొహంలో కనిపించే నిర్మలత్వమే అందుకు సాక్ష్యం.

ఇస్కాన్ పరివారానికి చెందిన భక్తిప్రేమ మహరాజ్ పూర్వాశ్రమంలో హస్తవాసి ఉన్న వైద్యుడు. భవరోగాలకు మందు కనిపెట్టాలన్న తపనతో కాషాయం కట్టుకున్నారు. చైతన్య చరణ్‌దాస్ ఇంజినీరింగ్ ప్రవేశపరీక్షలో జాతీయ ర్యాంకు సాధించారు. ఆతర్వాత వివిధ ఐటీ కంపెనీల్లో ఉద్యోగం చేశారు. 'సమాజంలోని సకల సమస్యలకూ ఆధ్యాత్మికతలోనే నాకు పరిష్కారం కనిపించింది. అందుకే, కార్పొరేట్ కొలువుల్ని కాదనుకుని వచ్చేశాను' అని వివరిస్తారు చరణ్‌దాస్.

**తామరాకు చందమే...**

సూర్యుడు ప్రాచీనం. సూర్యకిరణం నిత్యనూతనం. సన్యాసం యుగాల నుంచీ ఉంది. కానీ, కాలంతో పాటు, సమాజంతో పాటు... సన్యాసి బాధ్యతలూ మారుతున్నాయి. మునుపట్లా జనజీవనానికి దూరంగా వెళ్లే పరిస్థితి లేదు. ముక్కుమూసుకు బతికేయడమూ సాధ్యం కాని పని. ఆ మార్పు తీర్పును ఆమోదించాల్సిందే. ఆమోదిస్తున్నారు కూడా. పరిస్థితులకు తగినట్టే.... లాప్‌టాప్ వాడుతున్నారు. నెట్‌వర్కింగ్ విస్తరించుకుంటున్నారు. బ్లాగింగ్ చేస్తున్నారు. నిధుల సేకరణలో భాగంగా.... కార్పొరేట్ పెద్దలతో సన్నిహితంగా మెలుగుతున్నారు. ఇవన్నీ తామరాకు మీద నీటి బిందువు చందమే. అవసరమైనపుడు, అవసరమైనంత మేరకే!



నేచర్ ఫొటోగ్రఫీలో అంతర్జాతీయంగా పేరు తెచ్చుకున్న బౌద్ధభిక్షువు రూబిన్ విన్సెంట్ తానెప్పుడూ ప్రకృతిలోని అందాల్ని ఫొటో తీశానని చెప్పుకోడు. ప్రకృతి అందాల్ని తన కెమెరా ద్వారా స్వీకరించాననే అంటాడు. తీసుకోవడంలో... పెత్తనం ఉంది. స్వీకరించడంలో విధేయత ఉంది. అదీ సన్యాసికీ సామాన్యుడికీ తేడా! ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా యోగి ఆదిత్యనాథ్ పాలనలోనూ అలాంటి తేడానే కనిపిస్తుందంటారు విశ్లేషకులు. సాక్షాత్తు, ప్రధానమంత్రే తమ ఎంపీలతో 'ఆయన దగ్గరికి సిఫార్సుల కోసం వెళ్లకండి' అని ఆదేశించారంటేనే అర్థమౌతుంది - సన్యాసిలోని నిజాయతీ నిర్భీతీ!

సర్వసంగపరిత్యాగుల నాయకత్వంలో నడుస్తున్న సంస్థలు - సమర్థ నిర్వహణకూ, క్రమశిక్షణకూ మారుపేరుగా నిలుస్తున్నాయి. కోట్ల రూపాయల నిధులతో కార్యక్రమాలు చేపడుతున్నా నయాపైసా పక్కదారి పట్టిన ఆరోపణలేదు. లక్షల మంది భక్తులతో భారీ కార్యక్రమాలు జరిగినా, ఎక్కడా క్రమశిక్షణా రాహిత్యం కనిపించదు. కారణం... సన్యాసి ఆచరణాత్మక నాయకుడు. చెప్పిందే చేస్తాడు, చేసిందే చెబుతాడు.

వ్యాపార ప్రపంచం ఆధునిక సన్యాసిలో ఓ మేనేజ్‌మెంట్ గురువును చూస్తోంది. అతడి నుంచి నాయకత్వ పాఠాలు నేర్చుకోవాలని తహతహలాడుతోంది. వివేకానంద ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్



ఎక్సలెన్స్, బ్రహ్మకుమారి ఈశ్వరీయ విశ్వవిద్యాలయం లాంటి సంస్థలు మహామహ కంపెనీలకు విలువల పాఠాలు చెబుతున్నాయి. విధి నిర్వహణలో ఒత్తిడిని ఎదుర్కోవడం మొదలు మనసు మీద నియంత్రణ సాధించడం దాకా... అనేకానేక విషయాల మీద యువ స్వామీజీలు ఉపన్యసిస్తున్నారు. పాశ్చాత్య మేనేజ్‌మెంట్ పాఠాలు... ఇతరుల మీద పెత్తనం ఎలా చేయాలో చెబుతాయి. భారతీయ మేనేజ్‌మెంట్ మాత్రం, ముందు నిన్ను నువ్వు ఎలా తీర్చిదిద్దుకోవాలో బోధిస్తుంది. మార్పు నీ నుంచే మొదలుకావాలంటుంది. కాబట్టే, ఆ ఉపన్యాసాలకు యూట్యూబ్‌లో అంత ఆదరణ. ఐఐటీ ఖరగ్‌పూర్‌లో 'హ్యాపీనెస్- వేదాంత-పాజిటివ్ సైకాలజీ' అనే అంశం మీద సర్వప్రియానంద ఇచ్చిన ప్రసంగాన్ని ఇప్పటికే కొన్ని వేలమంది చూశారు.

ఆ మధ్య సర్వోత్తమానంద తమ కళాశాల పూర్వవిద్యార్థుల సమావేశానికి వెళ్లారు. సహపాఠీలు సాదరంగా స్వాగతించారు. 'మా బ్యాచ్‌లో నెలనెలా కోటి రూపాయల జీతం



సంపాదిస్తున్నవారు ఉన్నారు. కోట్ల టర్నోవరు కలిగిన సంస్థలకు నాయకత్వం వహిస్తున్నవారు ఉన్నారు. వారెవరిలోనూ కనిపించని ప్రశాంతత నీలో చూశాను. మేమంతా దేన్ని విజయంగా భావించామో అదసలు విజయమే కాదు. గెలుపంటే నీదే మిత్రమా?' అంటూ ఆ కాషాయాంబరధారిని గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు రాహుల్ అనే సహపాఠి. ఈ మిత్రుడే తొలిరోజుల్లో 'సన్యాసమా? అన్నీ వదులుకుంటావా? పెళ్ళీ పెటాకులూ లేకుండా బతికేస్తావా? ఎంతకాలం ఉంటావో చూస్తా!' అని వెక్కిరించాడు.

**సవాళ్లను దాటుకుంటూ....**

సన్యాసమంటే... ఎలాంటి బాధ్యతలూ లేని జీవితం కాదు. అదనంగా సమాజం బాధ్యతల్నీ తీసుకోవడం. ఆ జీవితంలోనూ పరుగు ఉంటుంది. అది ఆయాసాన్నిచ్చే పరుగు కాదు, ఆనందాన్నిచ్చే పరుగు. శ్రమ ఉన్నా, అది నిష్కామకర్మ. కాషాయం కట్టుకోవాలి. జుత్తు తీసేసుకోవాలి. పాత వాసనల్ని వదులుకోలేకా, మోహాల్నీ, వ్యామోహాల్నీ తప్పించుకోలేకా వెనక్కి వచ్చేవారి సంఖ్యా తక్కువేం కాదు. పక్కదారి పట్టి బహిష్కరణకు గురయ్యేవారూ ఉన్నారు. ఆమధ్య, అశ్లీల వీడియోలతో వార్తలకెక్కిన ఓ సన్యాసి జీవితమూ ఇలాంటిదే. ఓ మఠంలో సన్యాసాశ్రమం తీసుకున్నాక, కొన్నాళ్ళపాటు బాగానే ఉన్నాడు. కష్టపడి ఆంగ్లం నేర్చుకున్నాడు. ఆధ్యాత్మిక జ్ఞానాన్ని సంపాదించాడు. అతడి ఆలోచనలు దారి తప్పుతున్నట్టు అనుమానం రాగానే ఆశ్రమవర్గాలు సభ్యత్వాన్ని రద్దుచేసి బయటికి పంపేశాయి. ఇలాంటి, ద్వైదీభావం ఉన్న మనుషులు వ్యవస్థలోకి జొరబడకుండా వివిధ ఆశ్రమాలు చాలా జాగ్రత్తలే తీసుకుంటాయి. ఒక వ్యక్తికి పూర్తిస్థాయి సన్యాసదీక్ష ఇవ్వడానికి దాదాపు పదేళ్ళు పడుతుంది. కొన్నిసార్లు తల్లిదండ్రులవైపు నుంచీ వ్యతిరేకత వస్తుంది. మఠాల ముందు కూర్చుని 'మా అబ్బాయికి మత్తుమందు పెట్టారు' అంటూ ధర్నాలకు దిగుతున్నవారూ ఉన్నారు. కొన్ని వివాదాలు కోర్టుల దాకా వెళ్తున్నాయి.

ఓ యువకుడిది తెలంగాణలోని పల్లెటూరు. సంపన్న కుటుంబం. తండ్రి ఉద్యోగి. తనెప్పుడూ చదువుల్లో ముందుండేవాడు. ఆ చురుకుదనం చూసి కొడుకు ఏ కలెక్టరో అవుతాడని తండ్రి కలలుగన్నాడు. బుగ్గకారెక్కి తిరుగుతుంటే చూసి సంతోషించాలనుకున్నాడు. హఠాత్తుగా ఓ రోజు, 'నాన్నా నేను సన్యాసినవుతా!' అని బిడ్డ చెప్పగానే తట్టుకోలేకపోయాడు. 'కలెక్టరైతే హోదా ఉంటుంది, వ్యాపారం చేస్తే సంపాదన వస్తుంది. రెండూ కాకుండా, సన్యాసం తీసుకుంటానని అంటున్నావేమిటి?' అని తండ్రి వారించాడు, మందలించాడు, కోపగించుకున్నాడు. అయినా ఆ యువకుడు నిర్ణయాన్ని మార్చుకోలేదు. ఆ నిస్పృహతో తండ్రి తీవ్ర అనారోగ్యానికి గురయ్యాడు. కొడుకునే కలవరిస్తూ ప్రాణాలు వదిలాడు. ఈ పరిణామాలేవీ ఆ యువకుడి మనసును మార్చలేకపోయాయి. తనిప్పుడు, ఓ ఆధ్యాత్మిక సేవాసంస్థలో ముఖ్య బాధ్యతలు నిర్వర్తిస్తున్నాడు.

**అదో ప్రపంచం**

కొంతమంది యువ సన్యాసుల ప్రయాణం మధ్యలోనే మరో మలుపు తీసుకుంటుంది. ఐహిక విజయాల వైపు పరుగులు పెడుతుంది. అశ్విన్ శ్రీశైలం చెన్నైలో పుట్టిపెరిగాడు. పదిహేడేళ్ల వచ్చేసరికి .. 'నేనెవర్ని?' అన్న ప్రశ్న వేధించసాగింది. ఎక్కడి చదువులు అక్కడే ఆపేసి....ప్రపంచం మీద పడ్డాడు. సన్యాసిగా మారిపోయాడు. పాతిక ముప్పై దేశాలు తిరిగాడు. కొన్ని వేలమందితో తన ఆలోచనలు పంచుకున్నాడు. సంపన్నుడి నుంచి పేదవాడి దాకా, వయోధికుల నుంచి విద్యార్థుల వరకూ.. అంతా ఒత్తిడి వలలో పడుతున్నారని గ్రహించాడు. ఆ సమస్యకు ఓ సన్యాసిగా కాకుండా, ఎంట్రప్రెన్యూర్‌గానే సరైన పరిష్కారం ఇవ్వగలననే నమ్మకం కలిగింది. ఓ మిత్రుడి భాగస్వామ్యంలో 'ఆహా స్పేస్' ను ఏర్పాటు చేశాడు. తొలి దశలో కార్పొరేట్ కంపెనీలూ విద్యాసంస్థల్లో ధ్యానకేంద్రాల్ని ఏర్పాటు చేయాలన్నది ఆలోచన. ఇప్పటికే హెచ్‌సీఎల్ టెక్నాలజీస్‌తో ఒప్పందం కుదిరిపోయింది. ఆ మాజీ సన్యాసి 'బిజినెస్ ఐడియా'కు ముచ్చటపడి చాలా మంది ఇన్వెస్టర్లు ముందుకొస్తున్నారు.

ఆశ్రమాల్లో మఠాల్లో అంతా సవ్యమేనని అనుకోవడానికి వీల్లేదు. అక్కడి రాజకీయాలు అక్కడ ఉండవచ్చు. ఏ లక్ష్యంతో అన్నీ వదులుకుని వచ్చారో, ఆ లక్ష్యాన్ని సాధించుకోలేని పరిస్థితులు ఎదురుకావచ్చు. ఆ నిస్పృహలో ఆత్మహత్యకు పాల్పడినవారు ఉన్నారు. హత్యో ఆత్మహత్యో తెలియని ఉదంతాలూ ఉన్నాయి. కోస్తా ప్రాంతానికి చెందిన ఓ యువకుడు బౌద్ధం పట్ల ఆకర్షితుడై భిక్షువుగా మారాడు. విపస్సన బోధనలో మంచి పేరు తెచ్చుకున్నాడు. శ్రీలంక వెళ్లి పాళీభాష నేర్చుకున్నాడు. అనేక గ్రంథాల్ని తెలుగులోకి అనువదించాడు. బౌద్ధధర్మ ప్రచారానికి ఓ సంస్థను కూడా స్థాపించాడు. అంతలోనే తన గదిలో శవమై కనిపించాడు. ఆధ్యాత్మిక సాధనలోని అవరోధాల్ని తట్టుకోలేక ఆ కఠిన నిర్ణయాన్ని తీసుకున్నట్టు అంతిమలేఖలో రాసుకున్నాడు. కొన్ని హంసలు ఒడ్డుకు చేరవు!

• • •

తోటివాళ్ళు ఉద్యోగాలు మారుతుంటారు. దేశాలు మారుతుంటారు. ఆస్తులు కొంటుంటారు. ఐశ్వర్యాలు కూడబెట్టుకుంటూ ఉంటారు. పెళ్లిళ్లు, పిల్లలు, ఆ పిల్లల పెళ్లిళ్లు... ఎన్ని మలుపులు! ఎన్ని మజిలీలు! ఎన్ని అనుభూతులు! సన్యాసుల జీవితంలో మాత్రం ఎలాంటి మార్పులూ కనిపించవు. అదే కాషాయం, అదే జపమాల.

ఇదంతా పైపైకి కనిపించే తేడా. సన్యాసి జీవితంలో అంతకు రెట్టింపు మలుపులుంటాయి. అవి పైకి కనిపించవంతే. వేగంగా తిరిగే బొంగరం కదలకుండా ఉన్నట్టు అనిపిస్తుంది. మన కళ్లు ఆ వేగాన్ని అందుకోలేకపోవడం వల్లే మనమలా భ్రమపడతాం. యోగి కూడా అంతే. నిశ్చలంగా కనిపించినా, ఆ నిశ్చలత్వం చాటున అనంతమైన చైతన్యం ఉంటుంది.

**- సండే డెస్క్**






# మిక్చర్ పొట్లం

బొమ్మలు : **వెంకట్**

## రామేశ్వరమెళ్లినా...



**అం**తకుముందు రోజు రాజీనామా లేఖ ఇచ్చివెళ్లిన ఉద్యోగి, హెచ్‌ఆర్ మేనేజరు క్యాబిన్‌లోకెళ్లి.... 'సార్! నా నిర్ణయం మార్చుకుంటున్నా. చచ్చినా కొత్త ఉద్యోగంలో చేరను' అంటూ కాళ్లావేళ్లా పడ్డాడు.

'అంతలోనే ఏమైంది?' అనుమానంగా అడిగాడు హెచ్‌ఆర్ హెడ్డు.

'మా బాసు కూడా రాజీనామా చేసి, ఆ కంపెనీకే వెళ్తున్నాడట. ఇప్పుడే తెలిసింది' - జవాబిచ్చాడు ఉద్యోగి.

## ఒకే ప్రశ్న... మూడు జవాబులు

**త**మిళనాడు విద్యార్థులు ఒకే ప్రశ్నకు వివిధ పరీక్షల్లో వివిధ జవాబులు రాయాల్సి వచ్చింది. ఆ ప్రశ్న ... 'తమిళనాడు ముఖ్యమంత్రి ఎవరు?'

క్వార్టర్లీలో... 'జె. జయలలిత'
హాఫ్ ఇయర్లీలో... 'పన్నీర్ సెల్వన్'
యాన్యువల్ ఎగ్జామ్స్... 'పళనిస్వామి'

## ద్యే...వు....డా!

**ఓ** పాతిక అంతస్తుల భవనాన్ని నిర్మిస్తున్నారు. ఇరవై అయిదో అంతస్తు మీద సూపర్‌వైజరు ఉన్నాడు. కింద కార్మికుడు ఉన్నాడు. పై నుంచి ఎంత పిలిచినా అతడు పలకడం లేదు. దీంతో, అలా అయినా, తలపైకెత్తి చూస్తాడన్న ఉద్దేశంతో....జేబులోంచి ఓ పది రూపాయల నోటు విసిరాడు. కిందపడిన కరెన్సీని తీసి జేబులో పెట్టుకున్నాడు కానీ, పైకి చూడలేదు. ఈసారి వంద రూపాయల నోటు విసిరాడు. అయినా స్పందన లేదు. దీంతో, ఓ చిన్న రాయి విసిరాడు. అది కాస్తా వెళ్లి నెత్తికి తగిలింది. అప్పుడు తలపైకెత్తాడు.



...ఈ కథంతా చెప్పిన స్వామీజీ 'ఇందులో నీతి ఏమిటో తెలుసా?' అని అడిగాడు. ఎవరూ చెప్పలేకపోయారు. మళ్లీ తనే అందుకున్నాడు.

'వరాలు ఇచ్చినప్పుడు మనం దేవుడిని పట్టించుకోం. కష్టాలు ఎదురైనప్పుడే పైకి చూస్తాం'

## 'చావు' తెలివి!

**ఓ** మహిళ ... పేరున్న చిత్రకారుడి దగ్గరికెళ్లి తన బొమ్మ గీసిపెట్టమని అడిగింది. 'దయచేసి ఆ బొమ్మలో నేను ఓ రవ్వల నెక్లెస్ వేసుకున్నట్టు ఉండాలి' అని షరతు పెట్టింది.



'ఎందుకు మేడమ్' అమాయకంగా అడిగాడు ఆర్టిస్టు.

'పొరపాటున నేను చచ్చిపోయాననుకో. మా ఆయన తప్పకుండా రెండోపెళ్లి చేసుకుంటాడు. ఆ వచ్చే ఆవిడ ఈ బొమ్మను చూసి తీరుతుంది. ఈ నెక్లెస్ కోసం బీరువా అంతా గాలిస్తుంది. ఎక్కడా కనబడదు. దీంతో మా ఆయన ఆఫీసు నుంచి రాగానే గొడవపెట్టుకుంటుంది. మాటా మాటా అనుకుంటారు. ఇక అప్పటి నుంచీ రోజూ గొడవే...' కళ్లకు కట్టినట్టు జరగబోయేదంతా వివరించింది మహిళ.

'ఈ ఐడియా ఎలా వచ్చింది మేడమ్' ఆరాధనగా అడిగాడు చిత్రకారుడు.

'జీవన్ ఆనంద్ పాలసీ గురించి విన్లేదా....జిందగీకే సాత్ భీ, జిందగీకే బాద్ భీ! మా ఆయన ఇన్సురెన్సు ఉద్యోగి' - జవాబిచ్చింది మహిళ.

# నదులపై ఆసక్తి నన్నిక్కడికి రప్పించింది

ఎంసీఏ చదువు... అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఉద్యోగం... డాలర్లలో జీతం... భార్య కూడా అమెరికాలో డాక్టర్... ఆమె గ్రీన్‌కార్డు హోల్డర్... ఒక విధంగా విలాసవంతమైన జీవితం. ఇవన్నీ వదులుకుని జలవనరులపై ప్రేమతో స్వదేశానికి తిరిగొచ్చారు **శ్రీరాం వెదిరె**. భారతీయ జనతా పార్టీలో చేరి, ఆ పార్టీ జలవనరుల విభాగం కన్వీనర్‌గా ఉన్నారు. ఎడారిని తలపించే రాజస్థాన్ ఇసుక నేలల్లో జలయజ్ఞం చేసి, నీటి కరవును తరిమికొట్టి, అక్కడ అపర భగీరథుడిగా పేరు తెచ్చుకున్నారు. ప్రస్తుతం కేంద్ర జలవనరుల మంత్రిత్వశాఖ సలహాదారుగా, రాజస్థాన్ నదీ యాజమాన్య బోర్డు చైర్మన్‌గా పలు కీలక బాధ్యతలు నిర్వహిస్తున్న శ్రీరాం వెదిరె అడుగులు సాఫ్ట్‌వేర్ నుంచి సాగునీటిరంగం వైపు ఎందుకు పడ్డాయో ఆయన మాటల్లోనే...

SRIRAM VEDIRE



మాది వరంగల్ జిల్లా తొర్రూరు అయినప్పటికీ మా నాన్న ఉద్యోగరీత్యా పాల్వంచలో ఉండేవాళ్లం. నాన్న వెంకటరెడ్డి ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్‌లో పనిచేసేవారు. రైతుబిడ్డ కావడం... ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్‌లో పనిచేయడంతో ఆయనకు విద్యుత్, నీటి పారుదల రంగాలపై పట్టు ఉండేది. ఒక ఇంజనీర్‌గా జల, విద్యుత్ రంగాల్లో ఆయన చేసిన సేవలు, పోరాటాలు అందరికీ తెలుసు. మా నాన్నకు దేశభక్తి చాలా ఎక్కువ. నేషనలిస్టు భావాలుండేవి. పిల్లలకు దేశభక్తి, క్రమశిక్షణ అలవర్చాలంటే శిశుమందిరాలలో చదివించాలనుకున్నారు. అందుకే నా ప్రాథమిక విద్య పాల్వంచలోని సరస్వతి శిశుమందిర్‌లో జరిగింది. మా అమ్మ రమాదేవి టీచర్‌గా పనిచేసేది. ఉత్తమ ఉపాధ్యాయినిగా ఆమెకు పేరుండేది. అప్పట్లో అందరూ నన్ను రమాదేవి టీచర్ కొడుకు అంటుంటే గర్వంగా ఉండేది.

కొత్తగూడెంలో హైస్కూల్, కాలేజీ చదువులు పూర్తయిన తర్వాత ఉస్మానియా యూనివర్శిటీలో ఎంసీఏలో చేరాను. మాస్టర్స్ పూర్తయిన రెండేళ్లకు అంటే 1996లో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా అమెరికా వెళ్లాను. మంచి ఉద్యోగం, మంచి జీతం... లైఫ్ హ్యాపీగా గడిచేది. 1999లో పెళ్లి చేసుకున్నాను. అరేంజ్డ్ మ్యారేజ్. నా భార్య శిల్పది నిజామాబాద్. ఆమె అప్పటికే డాక్టర్ కోర్సు పూర్తిచేయడంతో నాతో పాటు అమెరికాకు తీసుకెళ్లాను. మా పిల్లలు సంహిత, శ్రీహిత అక్కడే జన్మించారు. మేము మిజోరిలోని సెయింట్‌లూయిస్ నగరంలో ఉండేవాళ్లం. ఆ నగరం మిసిసిపీ నది ఒడ్డున ఉంటుంది.

**నదులపై ఆసక్తి అక్కడే...**

నాకు ఒక అక్క, ఒక చెల్లెలు ఉన్నారు. వాళ్లు కూడా అమెరికాలో సెటిలయ్యారు. 2000లో నాన్న చీఫ్ ఇంజనీర్ హోదాలో రిటైరైన తర్వాత తరచూ మమ్మల్ని చూసేందుకు అమెరికా వచ్చేవారు. ఆయనకు నీటిపారుదల రంగంపై అపారమైన జ్ఞానం ఉంది కాబట్టి మా ఇంటికి వచ్చినప్పుడల్లా సరదాగా చుట్టుపక్కలున్న నదుల సందర్శనకు తీసుకెళ్లేవాణ్ణి. ఆ సందర్భంగా వాటి పుట్టుపూర్వోత్తరాలు, నదులపై కట్టిన ఆనకట్టలు, వాటి టెక్నాలజీ గురించి నాతో సమగ్రంగా చర్చించేవారు. విద్యుత్‌రంగ నిపుణుడిగా ఆయనకున్న అనుభవాన్ని, నీటి పారుదలకు సంబంధించిన అన్ని విషయాలను నాకు పాఠాలుగా బోధించేవారు. క్రమక్రమంగా తెలియకుండానే నాకు ఆ రంగంపై ఆసక్తి ఏర్పడింది. ఒకవైపు సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా పనిచేస్తున్నా నా మనసంతా నదుల చుట్టే తిరిగేది. మా నాన్నతో గంటల తరబడి నీళ్ల గురించీ, నదుల గురించీ చర్చించేవాణ్ణి. మన దేశంలోని నదుల ప్రవాహం, నీటి లభ్యత తదితర విషయాలపై కూడా అవగాహన పెరిగింది.

మేమంతా అమెరికాలో సెటిలవ్వడంతో హైదరాబాద్‌లో ఉంటున్న మా నాన్న ఒక విధంగా ఒంటరిగా ఫీలయ్యేవారు. పైగా ఆయనకు జాతీయ భావాలుండటంతో పుట్టిన గడ్డకు ఏదైనా చెయ్యాలని తరచూ నాతో అంటుండేవారు. డాలర్ల పరుగుకు ఫుల్‌స్టాప్ పెట్టి ఇండియాకు తిరిగి వచ్చేయమన్నారు. అప్పటికే నాన్నకు బీజేపీ రాష్ట్ర, కేంద్ర నాయకులతో పరిచయాలుండేవి. 2008లో నేను ఇండియాకు వచ్చినప్పుడు నన్ను అడ్వాణీగారికి పరిచయం చేశారు. ఆయనతోపాటు సుష్మాస్వరాజ్, ప్రకాష్ జవదేకర్‌లను తరచూ కలిసి నా ఆలోచనలను వారితో షేర్ చేసుకునేవాణ్ణి.




నాన్నతో..


భార్యతో..

నదుల అనుసంధానం, జల నిర్వహణ, తెలంగాణపై నాకున్న అభిప్రాయాలు వారిని బాగా ఆకట్టుకున్నాయి.

2009లో ఒకరోజు అద్వానీగారు ఫోన్‌చేసి నన్ను అర్జెంట్‌గా ఇండియాకు రమ్మన్నారు. నల్గొండ పార్లమెంట్ స్థానానికి నన్ను బీజేపీ తరఫున పోటీ చేయమన్నారు. నాకు ఆలోచించుకునే సమయం కూడా లేదు. మొత్తానికి ఆ ఎన్నికల్లో నేను ఓడిపోయాను. అయితే ఎన్నికలు నాలో కొత్త ఆలోచనలను రేకెత్తించాయి. ఇక్కడే శాశ్వతంగా ఉండిపోయేందుకు నిర్ణయించుకున్నా. ఇదే విషయాన్ని జాతీయ నాయకులకు చెబితే 'భేష్' అంటూ ప్రోత్సహించారు. గడ్కరీ నన్ను బీజేపీ వాటర్ మేనేజ్‌మెంట్ సెల్‌కు కన్వీనర్‌గా నియమించారు. ఆ హోదాలోనే చాలా ప్రాంతాలు తిరగడం వల్ల మన దేశంలోని నీటి వనరుల గురించి సమగ్రంగా తెలుసుకునే అవకాశం కలిగింది. 2012లో ఢిల్లీలో వాటర్ మేనేజ్‌మెంట్ సెల్ తరఫున ఒక మీటింగ్ ఏర్పాటుచేశాను. ఆ మీటింగ్‌కు వసుంధరరాజే అధ్యక్షత వహించారు. జల వనరులపై నా పవర్‌పాయింట్ ప్రజెంటేషన్ చూసి మెచ్చుకుని 'వచ్చే ఏడాది రాజస్థాన్‌లో ఎన్నికలున్నాయి. ఆ తర్వాత మీ ఆలోచనలను అక్కడ ఇంప్లిమెంట్ చేద్దాం' అన్నారు. 2013 డిసెంబర్‌లో ఆమె ముఖ్యమంత్రి పీఠం ఎక్కిన రోజే నన్ను పిలిచి ఆ ఎడారి ప్రాంతంలో గ్రౌండ్ వాటర్ రీచార్జ్ చేసే బాధ్యత అప్పగించారు.

**ఎడారిలో జలసిరి ...**

మన దేశ విస్తీర్ణంలో రాజస్థాన్ సుమారు 10 శాతం భూభాగాన్ని కలిగి ఉన్నప్పటికీ నీటి వనరులు అక్కడ అత్యంత తక్కువ స్థాయిలో (1.16 శాతం) ఉంటాయి. వర్షపు నీరు తప్ప ఇంకో ఆధారమే లేదు. రాజస్థాన్‌లో నేను ప్రసిద్ధ జల నిపుణులు హన్మంతరావుగారి 'ఫోర్ వాటర్' (చతుర్విధ నీటి) విధానాన్ని అమలుచేశాను. వివిధ శాఖల సిబ్బంది, ప్రజల సహకారంతో వర్షపు నీటిని భూమిలోకి ఇంకేలా చేసి భూగర్భ నీటిమట్టాన్ని పెంచడం, తేమశాతం పెంచడం, ఉపరితల నీరు నిల్వ ఉండేలా చేయడం ద్వారా 3,500 గ్రామాల్లో కరవును పారద్రోలాం. రెండో ఫేజ్‌లో మరో 4,200 గ్రామాల్లో ఈ ప్రయోగాన్ని అమలు చేసేందుకు సిద్ధమవుతున్నాం. ఇదంతా కూడా 'ముఖ్యమంత్రి జల స్వావలంబన అభియాన్' (ఎంజేఎస్ఎ) పథకం ద్వారా చేస్తున్నాం. ఇందులో భాగంగా అనేక చెరువులు, కుంటలు, చెక్‌డ్యామ్‌లు, వాగులు నిర్మించి అభివృద్ధి చేశాం. ఇందుకు టెక్నాలజీని బాగా వాడుకున్నాం. జియో శాటిలైట్ ఇన్ఫర్మేషన్ ఇమేజరీ, జియో ట్యాగింగ్‌తో పాటు 'వే పాయింట్' అనే మొబైల్ సాఫ్ట్‌వేర్‌ను కూడా రూపొందించాం. దీనివల్ల ఫీల్డ్‌లో ఉన్న ఉద్యోగులు ఆ రోజు ఎక్కడెక్కడికి వెళ్లారనే విషయం ఇట్టే తెలిసిపోతుంది. ఎప్పటికప్పుడు అందర్నీ మానిటర్ చేసుకుంటూ వంద శాతం ఫలితాలను రాబట్టాం.

టెక్నాలజీని సరిగ్గా వాడుకుంటే మన దేశంలో బెస్ట్ వాటర్ సొల్యూషన్స్ అప్లయ్ చేయొచ్చనేది నా ప్రగాఢ విశ్వాసం. శాటిలైట్ ద్వారానే ఈ భూమ్మీద ఏ రకమైన మట్టి నేలలున్నాయి? ఏ ప్రాంతంలో ఎలాంటి పంటలు వేయొచ్చు? నీరు ఎక్కడి నుంచి ఎక్కడికి ప్రవహిస్తోంది? ఎక్కడ నీటిని ఒడిసి పట్టవచ్చు?... అనే విషయాలన్నీ తెలుసుకోవచ్చు. రాజస్థాన్‌లో జలసంరక్షణ సక్సెస్ కావడంతో ప్రధాని మోదీ కూడా తన 'మన్ కీ బాత్'లో ఆ విజయం గురించి రెండుసార్లు మాట్లాడటం నాకు లభించిన గొప్ప ప్రశంసగా భావిస్తున్నా. రాజస్థాన్ విజయంతో కేంద్ర జలవనరుల మంత్రి ఉమాభారతి నన్ను 'గంగా క్లీనింగ్ అథారిటీ'లోకి సలహాదారుగా తీసుకున్నారు. 2015 ఏప్రిల్ నుంచి ఆ పనిలో బిజీగా ఉన్నా.

2014లో నా భార్యా పిల్లలను కూడా ఇండియాకు తీసుకొచ్చా. ప్రస్తుతం నా భార్య శిల్ప ఢిల్లీలోని అపోలో హాస్పిటల్స్‌లో కన్సల్టెంట్ ఫిజీషియన్‌గా పనిచేస్తోంది. నదులు, నీళ్లు, జల సంరక్షణ తప్ప నాకు వేరే వ్యాపకం లేదు. నీరే మనిషికి జీవాధారం. దాన్ని సరిగ్గా ఒడిసి పట్టుకుంటే ఈ నేల ఎప్పటికీ సస్యశ్యామలంగా ఉంటుంది. ఆ ప్రయత్నంలో నేను కూడా భాగస్వామినైనందుకు సంతోషిస్తున్నా.

● **చల్లా శ్రీనివాస్**

- ఫిలాసఫీ పుస్తకాలు ఎక్కువగా చదువుతా.
- స్వామి వివేకానంద రచనలన్నీ చదివాను.
- ఉత్తరప్రదేశ్‌లోని షాజహాన్‌పూర్‌లో ఉన్న శ్రీరాంచంద్ర మిషన్‌కు రెగ్యులర్‌గా వెళ్తుంటా.
- ధ్యానంలో నా గురువు శ్రీరాంచంద్ర జీ (బాబూజీ అంటారు).
- నాకు ఊహ తెలిసినప్పటి నుంచి మా ఇంట్లో ప్రతీ ఆదివారం 'సత్సంగ్' జరుగుతుంది. అమ్మానాన్నలతో పాటు నేను కూడా అందులో పాల్గొంటా. అందరం కలిసి ధ్యానం చేస్తాం.
- పిల్లలతో కలిసి యానిమేషన్ సినిమాలు చూడటం ఇష్టం.
- మా ఇద్దరు పిల్లలకు (సంహిత, శ్రీహిత) కరాటేలో ప్రావీణ్యం ఉంది. వారిద్దరూ తైక్వాండోలో బ్లాక్‌బెల్ట్ హోల్డర్స్.

# cyber క్రైమ్

## ఫ్రెండ్ రిక్వెస్ట్

'హాయ్...' ఫేస్‌బుక్‌లో రిక్వెస్ట్ పంపిన అమ్మాయి ప్రొఫైల్ ఫోటో చూస్తే టెంప్టింగ్‌గా ఉంది.

ఫేస్‌బుక్‌ను రెగ్యులర్‌గా ఫాలో అయ్యే ప్రకాశ్ మరో ఆలోచన లేకుండా 'హలో' అంటూ రిక్వెస్ట్‌ను యాక్సెప్ట్ చేశాడు.

మాటలు కలిశాయి. పరిచయం పెరిగింది. కొన్నాళ్లకు చాటింగ్ 'హాయ్' నుంచి 'నాటీ'ల మీదుగా 'స్వీట్ డ్రీమ్స్' వరకు వెళ్లింది. ఆ అమెరికన్ యువతి పేరు ఫ్రాన్సిస్.

• • •

హైదరాబాద్‌లో రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తున్నాడు ప్రకాశ్. అదృష్టం కలిసొచ్చి బాగా సంపాదించాడు. సోషల్ నెట్‌వర్క్‌లో యాక్టివ్‌గా ఉంటాడు. ఫేస్‌బుక్‌లో ఫ్రెండ్స్ ఎక్కువే. దేశ విదేశాలకు చెందిన వారితో ఫ్రెండ్‌షిప్ చేసుకున్నాడు. వారితో రెగ్యులర్‌గా చాట్ చేస్తుంటాడు.

కొత్తగా పరిచయమైన ఫ్రాన్సిస్ చిన్న వయసులోనే అమెరికాలో మంచి ఉద్యోగం చేస్తున్నట్టు చాటింగ్ ద్వారా తెలిసింది. మెసేంజర్‌లో పర్సనల్ ఫోటోల షేరింగ్ దాకా వెళ్లింది వ్యవహారం. ఫ్రాన్సిస్ అంటే ప్రకాశ్‌కు చచ్చేంత ఇష్టం. తను లేనిదే జీవితం లేదన్నట్టుగా తయారయ్యాడు.

ఫోన్‌లో మెసేజ్ అలెర్ట్ సౌండ్ వినిపించగానే ఆత్రుతగా చూశాడు.

"హాయ్ ప్రకాశ్... హౌ ఆర్ యూ" ఫ్రాన్సిస్ పలకరింపు.




"ఐయామ్ ఫైన్... హౌ ఎబౌట్ యూ డార్లింగ్..."

"దీజ్ ఆర్ మై న్యూ ఫోటోస్... సీ అండ్ ఎంజాయ్..." అంటూ కొన్ని పోస్ట్ చేసింది.

రెచ్చగొడుతూ హాట్ హాట్‌గా ఉన్న ఆ ఫోటో చూడగానే ప్రకాశ్ గొంతు తడారిపోయింది.

"ఇండియాకు రా... నీకు స్వర్గం చూపిస్తా..." అంటూ వెంటనే మెసేజ్ పెట్టాడు.

• • •

ప్రకాశ్ ఊహాలోకాల్లో తేలియాడుతుండగా ఒకరోజు ఫ్రాన్సిస్ నుంచి మెసేజ్ వచ్చింది.

'అమెరికన్ ఆర్మీలో తాను పనిచేస్తున్నానని, తనను ప్రస్తుతం ఐక్యరాజ్యసమితి దళాల్లో భాగంగా ఇరాక్ పంపించారని' ఆ మెసేజ్ సారాంశం.

ఇంకోరోజు "డియర్... నేను ఇరాక్ నుంచి నీ వద్దకు త్వరలో వస్తాను. అయితే, అమెరికాలో నా పేరిట చాలా డబ్బు ఉంది. ఎటూ జాబ్ రిజైన్ చేసి నీ దగ్గరకు రాబోతున్నా కదా!. ఆ డబ్బు నీకు పంపిస్తా..."

" ఓకే..."

"నా అకౌంట్‌లో ఉన్న 5.6 మిలియన్ డాలర్లను రెడ్‌క్రాస్ ఏజెంట్ విలియమ్స్ దగ్గర డిపాజిట్ చేస్తున్నా. నువ్వు అతడితో మాట్లాడి డబ్బు తెప్పించుకో" అని ఫ్రాన్సిస్ మెసేజ్ ఇవ్వడంతో ప్రకాశ్ మనసు గాలిలో తేలిపోయింది.

ఒకటా, రెండా... సుమారు 39 కోట్ల రూపాయలు... అప్పనంగా అందబోతున్నాయని తెగ ఆనందపడ్డాడు.

ఫ్రాన్సిస్ చెప్పినట్లే మరునాడు విలియమ్స్‌కు ఫోన్ చేశాడు.

"ఎస్... ఫ్రాన్సిస్ చెప్పింది. ఆ డబ్బు మీకు పంపిస్తా. మీ అకౌంట్ డీటైల్స్ పంపండి. ఫారిన్ ఫండ్స్ రిసీవ్ చేసుకోవడానికి మీకు అనుమతి ఉందా?"

"నేను తెలుసుకుని చెబుతా" అని ప్రకాశ్ రిప్లై ఇచ్చాడు.

"డియర్ బ్రో... నో ప్రాబ్లమ్... నేను చూసుకుంటా. రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నుంచి పర్మిషన్ తీసుకోవాల్సి ఉంటుంది. ఢిల్లీలో మా రెడ్‌క్రాస్ ఏజెంట్ మార్షల్ ఉన్నాడు. హి విల్ టేక్ కేర్ ఎవ్రీథింగ్" అంటూ మార్షల్ ఫోన్ నెంబరు పంపాడు విలియమ్స్.

ఆ తరువాత మార్షల్‌తో ప్రకాశ్ పలుమార్లు మాట్లాడాడు.

విదేశీయుల డబ్బును భారతీయుల ఖాతాలోకి బదిలీ చేయడానికి అవసరమైన ఫార్మాలిటీస్ పూర్తి చేయడానికి, కొంత మొత్తాన్ని మార్షల్‌కు ట్రాన్స్‌ఫర్ చేశాడు ప్రకాశ్. వివిధ ఫీజుల రూపేణా అప్పటికే దాదాపు కోటిన్నర రూపాయలకు పైగా మార్షల్ వసూలు చేశాడు. అయినా ఫ్రాన్సిస్‌కు సంబంధించిన డబ్బు ఇంకా చేతికి అందలేదు.

అదే విషయాన్ని ఫ్రాన్సిస్‌కు చాటింగ్‌లో చెప్పాడు.

"మార్షల్ నాక్కూడా ఫోన్ చేశాడు. డబ్బు వచ్చేస్తోంది. నేనూ వస్తున్నా..."

"ఎప్పుడు...?"

"ఇంకో వారం రోజుల్లో డబ్బుతో పాటు నేనూ ఇండియాకు వచ్చేస్తున్నా. అప్పుడిక మనం ఆ డబ్బుతో హ్యాపీగా ఉండొచ్చు. ఏదో డ్యూటీ ఫీజు కట్టాలట. ఇదే లాస్ట్ అని చెప్పాడు మార్షల్"

"ఇప్పటికే కోటిన్నరకు పైగా కట్టా. ఇంకా యాభై లక్షలంటే నావల్ల కాదు..." అని ప్రకాశ్ కాస్త గట్టిగా చెప్పడంతో ఫ్రాన్సిస్ చాటింగ్ ఆపేసింది.

అంతే... తాను మోసపోయానని గుర్తించిన ప్రకాశ్ లబోదిబోమంటూ, జరిగిన కథంతా తెలియజేస్తూ సైబర్‌క్రైమ్ పోలీసులకు ఫిర్యాదు చేశాడు.

మార్షల్ ఫేస్‌బుక్ ఐడీ, ఫోన్‌నెంబర్ల ఆధారంగా దర్యాప్తు ప్రారంభించిన సైబర్‌క్రైమ్ పోలీసులు ఢిల్లీలో మార్షల్‌ను పట్టుకున్నారు.

అప్పుడు తెలిసింది అసలు సంగతి ప్రకాశ్‌కు. అసలు ఫ్రాన్సిస్ అనే యువతి లేదనీ, ఇదంతా విలియమ్స్, మార్షల్‌లు కలిసి ఆడిన నాటకమనీ.

నేరస్థుడు మార్షల్ దొరికాడు కాబట్టి, అతడి దగ్గరి నుంచి తన డబ్బు వసూలు చేసి పెట్టమని పోలీసులను బతిమాలాడు ప్రకాశ్.

అయితే అప్పటికే ఆ డబ్బును వారు స్వదేశమైన నైజీరియాకు పంపారు.

వీటినే నైజీరియన్ మోసాలంటారనీ, ఆ డబ్బు రికవరీ చేయడం సాధ్యం కాదనీ, ఆ మొత్తం ఇప్పటికే అనేక చేతులు మారి ఉంటుందనీ పోలీసులు చెప్పడంతో ప్రకాశ్ బిక్కమొహం వేశాడు. 'అపరిచితుల నుంచి వచ్చే ఫ్రెండ్ రిక్వెస్ట్‌ను యాక్సెప్ట్ చేస్తే జరిగేది ఇదే' అంటూ సైబర్‌క్రైమ్ పోలీసులు హెచ్చరించారు.

● **వేముల సత్యనారాయణ,**
99854 88800

# దుబాయ్‌లో బాలీవుడ్

**బాలీవుడ్ - కొన్ని కోట్లమంది హృదయ స్పందన. సినిమానే శ్వాసించే వాళ్లకు కలల తీరం. సగటు సినీ అభిమాని నుంచి దర్శకుడో, నటుడో అవ్వాలనుకునే కలల బేహారుల వరకూ ఎవరికైనా చూసి తీరాలనిపించే యాత్రాస్థలి. అందుకే పర్యాటకులను ఆకర్షించడానికి దుబాయ్ పర్యాటక రంగం గతేడాది 'బాలీవుడ్ థీమ్ పార్క్'ని నిర్మించింది. ప్రపంచంలోనే మొదటి 'సినీ థీమ్ పార్క్'గా అవతరించిన ఈ పార్కులో చూపు తిప్పుకోనివ్వని ఆకర్షణలెన్నో ఉన్నాయి. పార్కులోని మొత్తం అయిదు విభాగాలు ఒకదాన్ని మించి మరొకటి పర్యాటకుల్ని కట్టిపడేస్తాయి.**

### ముంబై చౌక్

ఇది ఫుడ్ అండ్ షాపింగ్ జోన్. ఇక్కడి వీధుల్లో విహరిస్తుంటే కమ్మటి సువాసనలు జిహ్వాచాపల్యాన్ని రెచ్చగొడతాయి. షాపింగ్ బోర్ కొడితే షారుక్ 'డాన్' బృందంలో చేరి మాఫియా వ్యవహారాల్లో తలదూర్చొచ్చు. పోలీసులు వస్తే సరదాగా తప్పించుకుని పారిపోవచ్చు.



### బాలీవుడ్ ఫిల్మ్ స్టూడియోస్

తెరపై ఏం జరుగుతుందనేది సినిమా చూస్తే తెలుస్తుంది. తెర వెనుక ఏం జరుగుతుందనేది షూటింగ్ చూస్తే తెలుస్తుంది. 'జిందగీ న మిలేగీ దొబారా' వంటి సూపర్‌హిట్ సిన్మా ఎలా తెరకెక్కిందో ఇక్కడ చూడొచ్చు. బాలీవుడ్ సూపర్ హీరోస్ క్రిష్, రా వన్‌లను పలకరించొచ్చు.



### బాలీవుడ్ బులెవార్డ్

కళ్లు చెదిరే అలంకరణలతో కెఫేలూ, రెస్టారెంట్లూ కనిపించే ఈ జోన్ ప్రత్యేకత... లైవ్ ఎంటర్‌టైన్‌మెంట్. బాలీవుడ్ సంగీత కచేరీలు సేదతీరిస్తే, హోరెత్తించే డ్యాన్సులు ఉల్లాసాన్నిస్తాయి. వివిధ రకాల గేమ్స్ జోష్ నింపుతాయి.



### రాయల్ ప్లాజా

'బ్రాడ్‌వే' స్టైల్ బాలీవుడ్ మ్యూజికల్ కన్సర్ట్స్ గురించి ఈ తరానికి పెద్దగా పరిచయం లేకపోవచ్చు. ఆ గొప్పదనాన్ని విన్నా, అనుభూతించడానికి వారికి అవకాశమే లేదు. కానీ అందంలో తాజ్‌మహల్‌ని గుర్తుకు తెచ్చే 'రాజ్‌మహల్' థియేటర్ లో ఆ స్టైల్‌ని మళ్లీ ఆస్వాదించవచ్చు.



### రస్టిక్ రేవైన్

కొండల మధ్య కనిపించే పచ్చని పల్లె ఆత్మను అచ్చుగుద్దినట్టు ఆవిష్కరించిన విలేజ్ సెట్ ఈ జోన్ స్పెషాలిటీ. 'షోలే', 'లగాన్', 'దబాంగ్' సినిమాలకు సంబంధించిన సాహసకృత్యాల్లో మనమూ పాలుపంచుకోవచ్చు.



# క్యూట్ 'పింగాణీ'




ఉప్పు, కారం, చక్కెర... వంటి పదార్థాలను ప్లాస్టిక్ డబ్బాల్లో... స్టీలు గిన్నెల్లో నిల్వచేసే కంటే పింగాణీ పాత్రల్లో పెడితే మంచిదని అంటుంటారు చాలామంది. కిచెన్‌లో వాడేందుకు ఏమో గాని, డైనింగ్ టేబుల్ మీద పెట్టడానికి బాగుంటాయనే ఉద్దేశంతో ఎక్కువ మంది ఇష్టపడతారు. వీటిని తయారుచేయడంలోనే పెంపుడు కుక్కపై తనకున్న ప్రేమను చూపిస్తున్నాడు టెట్‌సుయా ఇసెడా. జపాన్‌కు చెందిన ఇసెడా తనకి ఎంతో ఇష్టమైన పెంపుడు కుక్క ఆకారంలో పింగాణీ వస్తువులను రూపొందిస్తున్నాడు. బుజ్జి కుక్కపిల్ల ఒంటరిగా కూర్చున్నట్టుగా... పడుకున్నట్టుగా... నవ్వుతున్నట్టుగా... ఏదో వంటను కలుపుతున్నట్టుగా... అమాయకంగా చూస్తున్నట్టుగా... అన్నీ కుక్క పిల్లల ముఖ కవళికలను ప్రతిబింబించేలా రూపొందిస్తున్నాడు. వీటిని ఆన్‌లైన్‌లో అమ్ముతాడు. చిన్న చిన్న మొక్కలు పెట్టేందుకు కుండీల్లా, పూలు పెట్టుకునేందుకు ఫ్లవర్‌వాజుల్లా కూడా రూపొందిస్తాడితను. వీటికి కూడా డిమాండ్ ఎక్కువేనట.



కొత్తగా

# జడ 'పిన్ను' సౌందర్యం





జుట్టును స్వేచ్ఛగా వదిలేసినా... ముడివేసి కొప్పు చుట్టినా... పాయలు పాయలుగా జడను అల్లినా... ఎక్కడో చోట ఒక పిన్ను పెట్టాల్సిందే. ఒకప్పుడు నల్లగా ఉండి వెంట్రుకల్లో కలిసిపోయిన ఈ జడ పిన్నులు... ఇటీవల కొత్త రంగులను అద్దుకుంటున్నాయి. శిశిరంలో రాలిపడే ఆకులు శిరోజాల్లో చేరినట్టుగా... తామరలూ, సన్నజాజి పూలూ పసిడి రంగులో విరబూసినట్టుగా... ఇంకా అప్పుడే విచ్చుకోవడానికి సిద్ధంగా ఉన్న మొగ్గలు, మెరిసే నక్షత్రాలు, చేపలు, ప్రేమ గుర్తులు, కత్తెరలు... ఇలా ఎన్నో వెరైటీ డిజైన్లతో జుట్టుకు కొత్త అందం తెస్తున్నాయి. పొడవైన, ఒత్తైన జడ ఉన్నవారికే కాదు, పొట్టి జుట్టు వారిలో కూడా శిరోజ సౌందర్యం ఉట్టిపడేలా చేస్తాయి ఈ క్రియేటివ్ పిన్నులు. సంప్రదాయానికి ఫ్యాషన్ జోడించినట్టుగా ఉండే ఈ జడపిన్నులు పెట్టుకుంటే ఇక పూల అవసరం ఉండకపోవచ్చు!



# ఫ్లాట్ చేసే మ్యాట్

రొటీన్ డిజైన్ల టేబుల్‌క్లాత్‌లకు కాలం చెల్లిపోయిందిక. కళ్లు చెదిరే రంగులతో, అచ్చెరువొందించే డిజైన్లతో నయా టేబుల్ మ్యాట్లు మార్కెట్లో హల్‌చల్ చేస్తున్నాయి. డ్రాయింగ్ రూమ్ టేబుల్‌పై వికసించిన పువ్వు , డైనింగ్ హాల్లో వర్ణరంజితమైన అరిటాకు, పిల్లలను ఆకర్షించే జెర్సీ ఆవు, ఎరుపు రంగు దేహంపై నల్ల చుక్కల బీటిల్ పురుగు... ఇలా ఎన్నో రకాల ఆకారాల్లో కొలువుదీరిన టేబుల్ మ్యాట్లు చూపరులను కళ్లు తిప్పుకోనివ్వవు. వేడి వేడిగా డిన్నర్ రెడీ చేసిన తర్వాత స్పూన్లు, ఫోర్కుల కోసం వెతుక్కుంటుంటారు చాలా ఇళ్లల్లో. కొత్తగా వస్తోన్న టేబుల్ మ్యాట్లకు చాకులు, స్పూన్లు, ఫోర్కులను దాచుకునే పాకెట్లు ఉంటున్నాయి కాబట్టి వెతుకులాట బాధ ఉండదు. పచ్చదనం కోసం పలవరించే ప్రకృతి ప్రేమికులను పలకరించేందుకు మెత్తని గడ్డిని అంటించుకున్న టేబుల్ మ్యాట్లూ సిద్ధంగా ఉన్నాయి.



# 'వాచ్' దిస్ స్టైల్




చేతి గడియారం పెట్టుకోవడాన్ని దర్జాగా భావించేవాళ్లు ఒకప్పుడు. కాలక్రమేణా ఖరీదైన ఆ దర్జా తన దర్పం తగ్గించుకుని సామాన్యులకు కూడా చేరువై... ఫ్యాషన్ సింబల్‌గా మారింది. అయితే సెల్‌ఫోన్ల వాడకం పెరిగిన తర్వాత సమయం తెలుసుకునేందుకు వాచీల వాడకం బాగా తగ్గిందనే చెప్పాలి. కాని ఫ్యాషనబుల్ యాక్ససరీగా మాత్రం 'రిస్ట్ వాచ్' ఇంకా తన హవా చూపిస్తూనే ఉంది. ఒకప్పుడు ఒకే చైన్‌తో ఉండే వాచీలు ఇప్పుడు ముందు వెనకా అదనపు హంగులను జోడించుకుంటున్నాయి. మగవారికి 'వాచ్ ప్లెస్ బ్రాస్‌లెట్' టైపులో... ఆడవారికి 'వాచ్ విత్ బ్యాంగిల్స్' టైపులో ఉండే ఈ చేతి గడియారాలు మార్కెట్లో కొత్త ట్రెండును సృష్టిస్తున్నాయి.



# రండి... ఆఫీసులోనే మండి!



**సాఫ్ట్‌వేర్ సంస్థలు కొన్ని ఎకరాల విస్తీర్ణంలో, కళ్లు చెదిరే బహుళ అంతస్థుల్లో ఉంటాయని తెలుసు. అక్కడంతా కంప్యూటర్లతోనే పని. కానీ 'సాఫ్ట్‌వేర్' ప్రాంగణాల్లో 'సాగు' కనిపిస్తే... అక్కడ క్యాబేజీ, టొమాటో, క్యారెట్, పాలకూర వంటి కూరగాయలు పండిస్తే... తప్పకుండా వింతగానే చెప్పుకోవాలి. ఐటీకి కేంద్రంగా చెప్పుకునే బెంగళూరులో ప్రస్తుతం 'సాఫ్ట్‌వేర్ సాగు' ప్రయత్నాలు ఊపందుకున్నాయి.**

'గార్డెన్ సిటీ' ఐటీ సిటీగా మారినప్పుడు ఎవరూ ఆశ్చర్యపోలేదు కానీ, ప్రస్తుతం ఐటీ ప్రాంగణాల్లో కూరగాయల సాగును చూసి అంతా ముక్కున వేలేసుకుంటున్నారు. బెంగళూరులోని 'సస్కెన్ టెక్నాలజీస్' సంస్థ ప్రాంగణంలో బీన్స్, స్వీట్‌కార్న్, క్యారెట్, కరివేపాకు, పాలకూర వంటి కూరగాయలూ, ఆకుకూరలూ పండిస్తున్నారు. సేంద్రియ ఎరువులతో పండిస్తున్న ఈ కూరగాయలను సంస్థ ఉద్యోగులు ఆఫీసు ప్రాంగణంలోనే కొనుక్కుని ఇళ్లకు తీసుకెళ్తున్నారు. దిగుబడిని బట్టి వారానికి ఒకరోజు (కొన్నిసార్లు రెండు రోజులూ) కూరగాయల 'మండి' ఏర్పాటు చేస్తున్నారు. రెండు దశాబ్దాల చరిత్ర ఉన్న 'సస్కెన్ టెక్నాలజీస్'లో గత మూడు నెలలుగా క్రమం తప్పకుండా నిర్వహిస్తున్న ఈ 'మండి' మిగతా సాఫ్ట్‌వేర్ కంపెనీలకు ఆదర్శంగా నిలిచింది.

## 'పాదు' పడిందిలా...

సాఫ్ట్‌వేర్ కంపెనీలో కూరగాయలు సాగుచేయాలనే ఆలోచనకు బీజం ఎలా పడిందంటే... " మా ఆఫీసు పక్కనే కంపెనీకి చెందిన నాలుగెకరాల భూమి ఖాళీగా పడుంది. దాన్ని క్రికెట్, బాస్కెట్‌బాల్ గ్రౌండ్‌గా ఉపయోగించుకునేవారు. అందులోనూ ఒక ఎకరం వృథాగా ఉండటంతో మా సీఈవో (రాజీవ్ మోడీ) దాన్ని పచ్చగా కనిపించేలా చేయమన్నారు. ఏవో మొక్కలు, గడ్డి పెంచే బదులు, కూరగాయలు సాగు చేద్దామనుకున్నాం. అలా పుట్టిందే ఈ మండి" అంటారు ఫెసిలిటీ మేనేజ్‌మెంట్, ఐటీ ఆపరేషన్స్ హెడ్‌గా పనిచేస్తున్న సునీల్ దత్.

కూరగాయల 'మండి' ఆలోచన రాగానే వెంటనే దానికొక రూపం తీసుకొచ్చారు. ఆ ప్రాంతాన్నంతా శుభ్రం చేసి, మట్టి పరీక్షలు చేయించి, కావాల్సిన సేంద్రియ ఎరువులను సిద్ధం చేసుకుని తొలుత క్యారెట్, బీట్‌రూట్, పాలకూర, మొక్కజొన్న పండించారు. ప్రారంభంలో వాటిని ఉద్యోగులకు కాంప్లిమెంటరీగా ఇచ్చేవారు. ఆ తర్వాత కూరగాయల సాగు పెంచి, మార్కెట్ ధర కన్నా 20 శాతం తక్కువ ధరలకు అమ్మడం మొదలెట్టారు. ఆ విధంగా వచ్చిన ఆదాయాన్ని తిరిగి విత్తనాలు కొనడానికి, వాననీటి సంరక్షణ ప్లాంట్ కోసం వెచ్చిస్తున్నారు. " ఇవి వంద శాతం సేంద్రియ కూరగాయలు. మేము ఎలాంటి రసాయన ఎరువులుగానీ, పురుగు మందులుగానీ వాడం" అని చెబుతారు దత్. మార్కెట్లో లభించే కూరగాయల కన్నా ఈ సేంద్రియ కూరగాయలు ఎక్కువకాలం నిల్వ ఉంటున్నాయనీ, కూరగాయలు కొనే సమయం కూడా ఆదా అవుతోందనీ ఉద్యోగులు సంతోషం వ్యక్తం చేస్తున్నారు. అంతేకాదు ఏ మాత్రం ఖాళీ దొరికినా వారు కూరగాయల క్షేత్రం వైపు అడుగులు వేస్తున్నారు. పచ్చని పొలంలో తిరగడం వల్ల మానసిక ఒత్తిడి కూడా దూరం అవుతోంది.

## ఇష్టమైనది పండించుకోవచ్చు...

బెంగళూరులోని 'మన్యత బిజినెస్ పార్క్'లో కూడా ఇలాంటి ప్రయత్నమే ఇంకాస్త భిన్నంగా జరుగుతోంది. అక్కడ నోకియా, కాగ్నిజెంట్, ఐబీఎం వంటి సంస్థలున్నాయి. 110 ఎకరాల్లో విస్తరించి ఉన్న ఈ బిజినెస్ పార్క్‌లో 15 ఎకరాలను 170 ప్లాట్లుగా విభజించారు. వాటిని ఉద్యోగులకు 'ఫస్ట్ కమ్ ఫస్ట్ సర్వ్' ప్రకారం ఉచితంగా ఇస్తారు. ఆ ప్లాట్లలో ఉద్యోగులు తమకు ఇష్టమైన వాటిని పండించుకోవచ్చు. విత్తనాలను కూడా ఉచితంగానే ఇస్తారు. గత కొన్నాళ్లుగా ఉద్యోగులు తమకు కేటాయించిన ప్లాట్లలో బేబీకార్న్, టమోటా, పచ్చి మిర్చి, పాలకూర వంటివి పండిస్తున్నారు. అలా సొంతంగా పండించిన ఆ పంటను ఎంచక్కా ఇంటికి తీసుకెళ్తున్నారు. "ఉద్యోగులు ఒత్తిడికి గురి కాకుండా ఉండేందుకే ఈ యాక్టివిటీ మొదలెట్టాం" అని వివరిస్తారు సీనియర్ మేనేజర్ గౌరవ్ భండారి.

విదేశాల్లో ఇప్పటికే పాపులరైన ఈ ట్రెండ్ ఇప్పుడిప్పుడే మన దేశంలో ఊపందుకుంటోంది. దీనివల్ల రెండు ఉపయోగాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. తక్కువ ధరలకే సేంద్రియ కూరగాయాలు లభిస్తుండటం ఒకటైతే... ప్రకృతికి దగ్గరగా ఉంటూ ఒత్తిడిని జయించడం రెండోది. మొత్తానికి 'కాంక్రీట్ జంగిల్స్' కాస్తా కూరగాయల మండీలుగా మారటం ఎవరికైనా సంతోషదాయకమే కదా.



# బుల్లెమ్మ

భీమరాజు
వెంకటరమణ



**జైపూర్ నగరం. క్రాంతిపుర రోడ్. సాయంత్రం ఆరు గంటలు. తెలుగువాడు వరప్రసాద్ ఇంట్లో విందు కార్యక్రమం. కుటుంబ సభ్యులే కాక నగరంలో ఉన్న కొందరు తెలుగువారు, స్థానికులు హాజరయ్యారు. కబుర్లతో అంతా సందడిగా ఉంది.**

**"డియర్ ఫ్రెండ్స్! మా ఆహ్వానాన్ని మన్నించి కుటుంబ సమేతంగా వచ్చినందుకు చాలా సంతోషంగా ఉంది. ఇది మా అబ్బాయి వసంత్ ఏర్పాటుచేసిన కార్యక్రమం మాత్రమే కాదు మరో ముఖ్యమైన సందర్భం కూడా ఉంది. అది మీతో పంచుకోవాలని నా అభిలాష" అన్నాడు వరప్రసాద్ .**

**"విత్ ప్లెజర్ ప్రసాద్‌గారు. చెప్పండి.." అన్నారు కొందరు ఉత్సాహంగా. వరప్రసాద్ సాహితీప్రియుడు కూడా కావడం వల్ల విషయాన్ని కథగా చెప్పడం మొదలుపెట్టాడు.**

• • •

"మన నెల్లూరు పట్టణంలో అదొక బ్రహ్మచారి గది. అందులో గోడలమీద సినిమాతారల శృంగార చిత్రాలు, కండలు తిరిగిన హీరోల బొమ్మలు కనపడవు. పోనీ వివేకానందుడు, బుద్ధుడి ఫోటోలు ఉన్నాయా అంటే అవీ లేవు. యాష్ ట్రేలు, అటకమీద ఖాళీ సీసాలు లేవు. సెల్‌ఫోన్‌లు, ల్యాప్‌టాప్‌లు అప్పటికి లేవు. గదిలో అడ్డంగా కట్టిన ఒక దండెం. దానిమీద ఎప్పుడూ ఒకటి రెండు బట్టలు వేలాడుతుంటాయి, ఆ గదిలోని వ్యక్తిలాగా.

ఒక రేకు కుర్చీ, కొన్ని పుస్తకాలు మాత్రమే అక్కడున్నాయి. బయట గోడమీద నీలం రంగు చాక్‌పీస్‌తో 'రామకృష్ణ' అనే అక్షరాలు దర్శనమిస్తాయి... అమ్మ పంపే మనియార్డర్ తెచ్చే పోస్ట్‌మ్యాన్‌ని ఆకర్షించటానికి. గదికి తాళం వెయ్యనవసరం లేదు. బయట గడియపెట్టి వెళుతుంటాడు.

ఆరోజు తెల్లవారి చాలా సేపయ్యింది. తలుపుకొట్టిన చప్పుడు. రామకృష్ణ బద్ధకంగా లేచి వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా బుల్లెమ్మ. ఆరు పదుల వయసు. ఐదడుగులు మించని ఎత్తు. మూడొంతులు తెల్లబడిన ఒత్తైన జుట్టు. మోచేతుల దాకా తెల్లని జాకెట్టు. ఆకుపచ్చ రంగు నేత చీర. అర్ధరూపాయి పరిమాణంలో బొట్టు. మెడలో పసుపుతాడుతో పాటు మరో పూసల దండ. ఒకవిధమైన మందహాసంతో కూడిన చూపు. అందులో కనపడేది వేదాంతతత్వమో, నీ సంగతి నాకు తెలుసులే అనే నిర్లక్ష్యభావమో ఎవరికి కావలసినట్లు వాళ్ళు అన్వయించుకోవచ్చు. చేతిలో చిన్న గిన్నె.

ఆమె పక్కింట్లో కూతురు దగ్గర ఉంటున్నదని రామకృష్ణకు తెలుసు. పొట్టిగా ఉంటుందనో ఏమో బుల్లెమ్మ అని పిలుస్తారు. ఆమె అసలు పేరు అతనికి అప్పుడు తెలియదు. ఆ బిల్డింగులో రామకృష్ణ మొదటి అంతస్తులో ఒక గదిలో ఉంటాడు. ఆపై గదుల్లో కాలేజీ విద్యార్థులు ఉంటారు. రామకృష్ణ బయటకు వెళ్ళేప్పుడు వచ్చేప్పుడు కింద గేటు దగ్గర బుల్లెమ్మ తారసపడుతూ ఉంటుంది. హుషారుగా జోకులేస్తూ ఉంటుంది. ఆమె వాలకం, తన దగ్గర చొరవ చూపడం రామకృష్ణకు నచ్చదు. కానీ ఆమె చూపులు ఎందుకో అతన్ని ఆకర్షిస్తాయి, ఒక్కోసారి ఆదేశిస్తాయి కూడా.

"పై గదుల్లో ఉన్న అబ్బాయిలందరూ పండక్కి నిన్ననే ఊరెళ్ళిపోయారు. నువ్వు మీ ఊరికి పోలేదే నాయనా? ఇంత పొద్దెక్కిందాకా పడుకున్నావేంటి?" అడిగింది కళ్ళలోకి సూటిగా చూస్తూ. ఆమె ప్రశ్నలకు రామకృష్ణ ముఖంలో కాస్త చిరాకు, పెదవులపై నీరసపు చిరునవ్వు సమాధానాలయ్యాయి.

ఆమె అతన్ని పట్టించుకోలేదు. అతన్ని చేత్తో పక్కకు జరుపుతూ చొరవగా లోపలికొచ్చి అటూయిటూ చూసి పక్కన కనపడిన కొబ్బరినూనె సీసా తీసుకొని అతన్ని చేయిపట్టి లాగి కుర్చీలో కూర్చోబెట్టి తలంటింది. అతని చేతిలో తను తెచ్చిన చిన్న గిన్నె పెట్టి "ఇది కుంకుడుకాయ పులుసు, తలస్నానం చెయ్యి" అని వెళ్ళిపోయింది.

రామకృష్ణ స్నానం చేసి వచ్చి కూర్చున్నాడు. ఇంటి దగ్గర అమ్మ, తమ్ముడు, చెల్లెలు గుర్తొచ్చారు. పండక్కి ఇంటికి రమ్మని ఉత్తరం రాసినా వెళ్ళలేదు. మరుసటి రోజు ఒక పెద్దమనిషిని ఉద్యోగం కోసం కలవాలి.

బుల్లెమ్మ మనుమరాలు వచ్చి "ఇవాళ మా అమ్మమ్మ పుట్టినరోజు" అని పాయసం గిన్నె అతని చేతిలో పెట్టి వెళ్ళిపోయింది.

మరునాడు గంట నిరీక్షణ తరువాత ఆ ఉద్యోగమిస్తానన్న పెద్ద మనిషితో మాట్లాడడానికి వీలైయింది. ఆయన సొరుగులోంచి ఏదో కాగితం తీశాడు. అప్పాయింట్‌మెంట్ లెటరేమో! రామకృష్ణ లోపల ఆశల అలలు పైకి లేచాయి. "ప్రస్తుతం ఖాళీలు ఏమీ లేవబ్బాయ్! ఇదిగో మా రైస్‌మిల్లులో పనిచేస్తున్నావని ఉత్తరం. ఇది తీసుకెళ్ళి అనుభవం ఉందని ఎక్కడన్నా ప్రయత్నించు, పని తప్పక దొరుకుతుంది" అని ఆ ఉత్తరం చేతిలో పెట్టి రాబోయే ఉద్యోగానికి తనే కారణమైనట్లు దర్పం కనపర్చి తన పనిలో నిమగ్నమైనాడు. రామకృష్ణ ఆశల అలలు ఎప్పటిలాగే సద్దుమణిగాయి. తిరుగుముఖం



పట్టాడు.

ఎండలో తిరుగుతూ పనిచేసే సూపర్‌వైజర్ పనికి సిద్ధపడ్డా దొరకలేదు. పి.జిలు చేసిన వాళ్ళు పేపర్ బాయిస్‌గా, సినిమాహాల్లో బుకింగ్ క్లర్కులుగా పనిచేసే రోజుల్లో కేవలం బి.ఏ. చేసిన రామకృష్ణకు ఉద్యోగం దొరకాలంటే దురాశేనేమో!

ఆ రోజు ఎప్పటిలాగే తెల్లవారుఝాము వరకు అతనికి నిద్ర పట్టలేదు. కాస్త పరిచయం ఉన్న ఒక మెడికల్ షాపు నుంచి అప్పుడప్పుడూ ఒక్కొక్కటిగా తెచ్చుకొనే నిద్రమాత్రలలో ఒకటి సగం తుంచి వేసుకొని నిద్రపోయాడు. వారానికొకసారైనా అలా జరుగుతుంటుంది.

రెండ్రోజుల్లో కట్టాల్సిన మెస్ బిల్లు, తరువాత కట్టాల్సిన గది అద్దె, రెండూ భూతాల్లా కనబడుతున్నాయి.

అమ్మ ఈసారి ఏ వస్తువు అమ్మేస్తుందో! అసలు అమ్మటానికి ఇంక ఏమి మిగిలున్నాయో! అమ్మ దగ్గర నుండి వచ్చే మనియార్డర్ కోసం ఎదురుచూసే నిస్సహాయత ఏదో పెద్ద నేరం చేసిన వాడిలా నిలదీస్తూనే ఉంది. నెలల తరబడి చేస్తున్న ప్రయత్నాలు నీరుగారిపోతున్నాయి. మనోధైర్యం మాయమైపోయింది. ఒక్కసారిగా నిరాశ ఆవహించింది.

తీక్షణంగా శూన్యంలోకి చూస్తూ గోడకానుకుని గదిలో కూర్చొని ఉన్నాడు. చీకటిపడి చాలాసేపయింది. వెలుతురు భరించలేనివాడిలా బెడ్ లైట్ మాత్రమే వేసుకున్నాడు. అతని దృష్టి మెల్లగా ఎదురుగా ఉన్న అల్మారాలో నిద్రమాత్రల డబ్బా మీద పడింది. డబ్బా ఊపి చూశాడు, సగానికి పైనే మాత్రలు ఉన్నట్టున్నాయి. క్రమేపీ మనసు ఆలోచించడం మానేసింది. ఒక్కసారిగా డబ్బాలోని మాత్రలన్నీ నోట్లో ఒంపేసుకొని నీళ్ళు తాగేసాడు. మెల్లగా వచ్చి చాపమీద పడుకున్నాడు. ఫ్యాను లయబద్ధంగా తిరుగుతోంది. క్రమేపీ మెదడు మొద్దుబారిపోతోంది.

ఒక్కొక్కరూ అతని స్మృతి నుండి మాయమవుతున్నారు. ఉద్యోగాలిస్తామని తిప్పించిన వాళ్ళు, హేళనగా మాట్లాడినవాళ్ళు, మెస్ యజమాని, ఇంటి యజమాని, చివరికి అమ్మా, చెల్లెలు, తమ్ముడు అందరూ... కళ్ళు మూతలుపడ్డాయి. తెల్లవారింది. ఎవరి పనుల్లో వాళ్ళున్నారు. పది గంటలు దాటింది. రామకృష్ణ గది తలుపులు మూసుకునే ఉన్నాయి. కాసేపటికి బుల్లెమ్మ వచ్చి తలుపు కొట్టింది. ఆగి ఆగి తలుపు కొడుతూనే ఉంది. ఎట్టకేలకు తలుపులు తెరుచుకున్నాయి.

రామకృష్ణ తల విదిలించుకొని చూశాడు. ఆమె మందహాసంతో నిలబడి ఉంది. అతనికి అయోమయంగా ఉంది. "బాబూ! అలా ఉన్నావేంటి? వెళ్ళి ముఖం కడుక్కురా" అన్న బుల్లెమ్మ మాటలకు పూర్తిగా ఈ లోకంలోకి వచ్చాడు. ఆలోచిస్తూనే స్నానాల గది వైపు నడిచాడు. అతను వచ్చేసరికి బుల్లెమ్మ తను తెచ్చిన క్యారేజీ ఊడదీసి గిన్నెలు ప్రక్కన పెట్టింది. దగ్గరుండి వడ్డించింది. ముద్ద నోట్లో పెట్టుకోగానే అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "అయ్యో! కూరలో కారమెక్కువైనట్లుందే, ఇదిగో మంచినీళ్ళు తాగు" అని గ్లాసు చేతికిచ్చింది. ఆ కన్నీళ్ళకు కారణం కారం కాదని ఇద్దరికీ తెలుసు.

భోజనం అయ్యాక అతనికి కబుర్లు చెప్పనారంభించింది. తన భర్త బాధ్యతారహితంగా తనను ఒంటరిదాన్ని చేసి

"నేను పెట్టిన పచ్చళ్ళు మొదట్లో ఎవరూ కొనేవారు కాదు. కొన్ని మేమే వాడుకునేవాళ్ళం. కొన్ని చెడిపోయేవి. ఈ రోజు మా ఇంటికొచ్చి మరీ కొనుక్కెళుతున్నారు. పట్టువదలని ప్రయత్నానికి తప్పక దారి దొరుకుతుంది. ఒకరితో పోలిక వద్దు. మనం చెయ్యాల్సింది ఎప్పుడూ మనకు తెలుస్తూనే ఉంటుంది. అది చేసుకుంటూ పోవడమే మన పని. నా అనుభవం అది"

పదేళ్ళ క్రితమే దేశాలు పట్టి వెళ్ళిపోయినా, భవిష్యత్తును గురించిన భయాన్ని పక్కనపెట్టి, కూతురు దగ్గర ఉండాల్సొచ్చినా, వాళ్ళమీద ఆధారపడకుండా చేతనైన పనులు చేస్తూ, ఖాళీ సమయాల్లో పచ్చళ్ళు, పొడులూ చేసి అమ్ముతూ వీలైనంత సంపాదిస్తూ గౌరవంగా జీవిస్తున్న తన విషయాలు కొన్ని చెప్పింది.

"నేను పెట్టిన పచ్చళ్ళు మొదట్లో ఎవరూ కొనేవారు కాదు. కొన్ని మేమే వాడుకునేవాళ్ళం. కొన్ని చెడిపోయేవి. ఈ రోజు మా ఇంటికొచ్చి మరీ కొనుక్కెళుతున్నారు. పట్టువదలని ప్రయత్నానికి తప్పక దారి దొరుకుతుంది. ఒకరితో పోలిక వద్దు. మనం చెయ్యాల్సింది ఎప్పుడూ మనకు తెలుస్తూనే ఉంటుంది. అది చేసుకుంటూ పోవడమే మన పని. నా అనుభవం అది" అని అతనివైపు పరిశీలనగా చూసింది.

నిస్సహాయ స్థితి నుండి ఒక చదువులేని స్త్రీ స్వయం ఉపాధి ఏర్పరుచుకొని గౌరవంగా జీవిస్తున్నది. అన్న నిజం అతని కళ్ళముందు కనపడుతున్నది. స్తబ్దుగా ఉన్న మనసులో ఎక్కడో కాస్త కదలిక ఏర్పడింది. ఆశాజనకంగా ఆలోచించడానికి అది కారణమైంది.

ఆ మర్రోజు సాయంత్రం బుల్లెమ్మ ఒక కుర్రాణ్ణి వెంటబెట్టుకుని వచ్చి "చూడు బాబూ! ప్రస్తుతం సంపాదన లేదనేగా నీ ఆలోచన? కలిసొచ్చే కాలమంటే ఇదే! ఇదిగో వీడిపేరు చలపతి, పదో తరగతి పరీక్షల్లో అన్నిట్లో పాసైనా ఆ ఇంగ్లీషులో మాత్రం మూడేళ్ళ నుండి డిమికీలు కొడుతున్నాడు. వీళ్ళ నాన్నకు బాగా డబ్బుంది. వీడికి నువ్వు చదువు చెప్పి ఆ పదో తరగతి గట్టెక్కించావంటే వాళ్ళ నాన్న చేత నీకు ఐదొందలు ఇప్పిస్తాను. ఇదిగో రెండొందలు బయానా" అంటూ డబ్బు చేతిలో పెట్టింది. అనుకోకుండా డబ్బు చేతిలో పడేసరికి రామకృష్ణకు మహదానందం కలిగింది. అది నెలనెలా ఇంట్లో ఉన్న ఏదో ఒక వస్తువు అమ్మేసో, అప్పుచేసో అమ్మ పంపించే డబ్బు కాదు. జీవితంలో మొట్టమొదటిసారిగా తనకు సొంతంగా వచ్చిన డబ్బు.

రామకృష్ణ ఎప్పుడో చదివిన ఇంగ్లీషు గ్రామరు మళ్ళీ మననం చేసుకొని ఇప్పటి పదో తరగతి పాఠాలు బాగా అధ్యయనం చేసి చలపతికి సాధ్యమైనంత ఎక్కువ సమయం శ్రద్ధగా పాఠాలు చెప్పనారంభించాడు. చలపతి పాసయ్యాడు. చలపతి నాన్న వచ్చి రామకృష్ణని అమాంతం వాటేసుకుని వెయ్యి రూపాయలు చేతిలో పెట్టి తన ఆనందాన్ని ప్రకటించుకున్నాడు.

ఉక్కిరిబిక్కిరైన రామకృష్ణ ఆ డబ్బు చేతిలో పట్టుకొని అలాగే కూర్చుండిపోయాడు. తన ప్రతిభ తనకంటే బుల్లెమ్మే ముందు ఎలా పసిగట్టింది అనుకున్నాడు. అంతలోనే బుల్లెమ్మ వచ్చింది. వస్తూనే అతని నోట్లో బెల్లం ముక్క పెట్టింది. చెమర్చిన నాలుగు కళ్ళు పరస్పరం తృప్తిగా చూసుకున్నాయి.

"నువ్వు పాఠాలు చెబుతుంటే చాలాసార్లు విన్నాను. నీ మాటతో ఎదుటివాళ్ళని ఆకట్టుకోగలవు. నువ్వు ఉద్యోగం, వృత్తి,

వ్యాపారం దేన్లోనైనా రాణిస్తావు. నువ్వు ఉద్యోగాలిచ్చే స్థాయికి వస్తావు బాబూ!" అంటూ భుజం తట్టి వెళ్ళిపోయింది. బుల్లెమ్మ మాటలు అతనిలో మిగిలివున్న నిరాశాభావాల్ని కూడా పూర్తిగా తుడిచివేశాయి.

'హోమ్ ట్యూషన్స్ చెప్పబడును' అని పేపర్‌లో ప్రకటన ఇచ్చాడు. ఆ క్రమంలో పరిచయమయ్యాడు పాపిరెడ్డి అనే పట్టణ ప్రముఖుడు. అది రామకృష్ణ జీవితంలో మరో మలుపు. జడపదార్థం లాంటి పాపిరెడ్డి కొడుకు చదువులో రాణించడంతో వారి కుటుంబానికి రామకృష్ణ బాగా దగ్గరయ్యాడు. పిల్లవాడికి చదువు చెప్పడంతో పాటు పాపిరెడ్డి సివిల్ కాంట్రాక్టుల వ్యవహారాలు కొన్ని చూసే పని సంపాదించాడు. వ్యాపార మెళకువలు తెలుసుకున్నాడు. సంవత్సరం తరువాత వాళ్ళు అతన్ని హైద్రాబాద్ పంపించారు. అక్కడ నుండి అంచెలంచెలుగా రామకృష్ణ వృత్తితో పాటు దశ కూడా మారిపోయింది.

చెల్లి, తమ్ముడు పట్ల తన బాధ్యతను



నిర్వర్తించాడు. తల్లిని శ్రద్ధగా చూసుకుంటూ మేలైన వైద్యం చేయిస్తూ ఆమె జీవిత కాలాన్ని సాధ్యమైనంత పొడిగించే ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు. కొన్నాళ్ళకు కొడుకు ప్రయోజకత్వం కళ్ళారా చూసి ఆమె తృప్తిగా వెళ్ళిపోయింది.

కాలంతో పాటు ఈసారి తన అభివృద్ధి కూడా పోటీపడి పరుగెడుతోంది.

వ్యాపార నిమిత్తం దేశంలో ప్రధాన నగరాలు తిరుగుతున్న రామకృష్ణ ఒకసారి చెన్నై వచ్చాడు. అక్కడి నుండి నెల్లూరు వెళ్ళి బుల్లెమ్మను కలిసాడు. ఆమె చాలా సంతోషించింది.

"బుల్లెమ్మా! నువ్వెవరో! నేనెవరో! ఈ బిల్డింగులో ఇంతమంది అద్దెకుండగా నన్ను కనిపెట్టుకుని ఉన్నావు. నీపై అసహనం కనపరుస్తున్నా ఓర్పుతో మాటలు చెబుతూ నాలోని నిరాశను ఎప్పటికప్పుడు దూరం చేశావు. నీ మాట అక్షరాలా నిజమైంది. కాంట్రాక్టరుగా స్థిరపడ్డాను. నా దగ్గర ముప్పైమందికి పైగా పనిచేస్తున్నారు. నీ రుణం తీర్చుకోలేను లాంటి మాటలు చెప్పనుగానీ నీకేదైనా చెయ్యాలని ఉంది..."

> "క్రిమికీటకాలు కూడా బతకడానికి నిరంతరం పోరాటం చేస్తుంటాయి. మేధావిననుకునే మనిషి మాత్రం అప్పుడప్పుడూ వెనుకంజ వేస్తుంటాడు. నీ జీవితం నీ ఒక్కడి సొంతం కాదు, అందులో నువ్వుంటావు, నీవాళ్ళుంటారు, సమాజం కూడా ఉంటుంది. దాన్నించి తప్పుకోవాలనుకోవడం తప్పు. అందుకు ప్రయత్నించావు. అప్పుడు నిన్ను నేరుగా మందలించలేకపోయాను, నీ అభిమానం నా దగ్గర దెబ్బతినకూడదని, అందుకే తరువాత మొట్టికాయతో సరిపెట్టాను"

అని అడిగాడు.

అతనికిష్టమైన నిర్లక్ష్యపు చిరునవ్వు ఆమె పెదవులపై మెరిసింది. అతను చిరుకోపం కనపర్చాడు. "రెండు కోరికలున్నాయి" అన్నది.

"చెప్పు బుల్లెమ్మా!" అన్నాడు ఆతృతగా.

"మొదటిది నా చేత్తో వడ్డిస్తా, ఇక్కడే భోజనం చెయ్యి! రెండవది తిన్న తరువాత చెబుతా" అన్నది. అతను నిరుత్సాహపడ్డాడు. భోజనం చేసి కబుర్లు చెప్పుకుంటున్న సమయంలో "ఇప్పుడు చెప్పు బుల్లెమ్మా! ఆ రెండవ కోరిక ఏంటి?" అడిగాడు. "నీ తలపై ఒక మొట్టికాయ వెయ్యాలని ఉంది" అంటూ ఆ పని చేసింది. రామకృష్ణ ఆశ్చర్యపడి పెద్దగా నవ్వాడు. ఆమె పెద్ద మనసు ముందు తన ఆర్భాటం ఎంత చిన్నదో అనిపించింది. ఆమె యోగక్షేమాలు తెలుపుతూ ఉండమని చెప్పి వచ్చేసాడు.

తరువాత బుల్లెమ్మ ఎదురింట్లో ఫోను పెట్టించుకున్నారు. అప్పుడప్పుడూ ఆమెను అక్కడికి పిలిపించుకొని మాట్లాడేవాడు. ఏవిధంగానైనా ఆమెకు ఏదో ఒకటి చేద్దామన్నా ఆమె సున్నితంగా విషయాన్ని దాటేసేది.

కొన్ని నెలల తరువాత ఒకరోజు ఉదయాన్నే బుల్లెమ్మ అల్లుడు ఫోన్ చేసి ఆమె గతరాత్రి చనిపోయిందని చెప్పాడు. రామకృష్ణ హుటాహుటిన నెల్లూరు చేరాడు.

"రాత్రి భోజనం చేసి పడుకుంది. ఉదయం ఐదింటికల్లా లేచేది, కానీ లేవలేదు" విలపిస్తూ చెప్పింది బుల్లెమ్మ కూతురు.

బుల్లెమ్మ ముఖం ప్రశాంతంగా ఉంది. "ఆత్మాభిమానం, కష్టపడే లక్షణం, స్నేహ స్వభావం, ప్రశాంతమైన జీవనయానం, అందుకే ఆమెకు అనాయాస పయనం లభించింది" అనుకున్నాడు రామకృష్ణ.

ఆమె పెద్దకర్మ కార్యక్రమం తరువాత రామకృష్ణ తను అద్దెకున్న గది దగ్గరకు వెళ్ళాడు. అందులో ప్రస్తుతం ఎవరూ లేరు. బయట గడియపెట్టి ఉంది. తలుపు ప్రక్కన గోడను స్పృశించాడు. 'రామకృష్ణ' అనే అక్షరాలు అక్కడ లేవు కానీ తన మనసుకు కనపడుతున్నాయి. కిటికీలోంచి చూశాడు. ఏవో పాత సామాన్లు పడేసి ఉన్నాయి. "తను మింగిన నిద్రమాత్రలు ఎందుకు పనిచెయ్యలేదు?" అప్పుడప్పుడూ కలిగే సందేహం మరోసారి కలిగింది.

రాత్రి తిరుగు ప్రయాణం అయ్యే సమయంలో "మా అమ్మ నీకిమ్మని వారం క్రితమే ఇచ్చింది" అంటూ ఒక కవరు చేతిలో పెట్టింది బుల్లెమ్మ కూతురు. కవరు చింపి ఆతృతగా ఉత్తరాన్ని బయటకు తీసి చూశాడు. ఎవరో చిన్నపిల్లల చేత రాయించినట్లుంది. "క్రిమికీటకాలు కూడా బతకడానికి నిరంతరం పోరాటం చేస్తుంటాయి. మేధావిననుకునే మనిషి మాత్రం అప్పుడప్పుడూ వెనుకంజ వేస్తుంటాడు. నీ జీవితం నీ ఒక్కడి సొంతం కాదు, అందులో నువ్వుంటావు, నీవాళ్ళుంటారు, సమాజం కూడా ఉంటుంది. దాన్నించి తప్పుకోవాలనుకోవడం తప్పు. అందుకు ప్రయత్నించావు. అప్పుడు నిన్ను నేరుగా మందలించలేకపోయాను, నీ అభిమానం నా దగ్గర దెబ్బతినకూడదని, అందుకే తరువాత మొట్టికాయతో సరిపెట్టాను" అని రాసుంది.

నిద్రమాత్రలు బుల్లెమ్మే మార్చేసిందన్నమాట! మరి నేను మింగినవి? తను వాడే హోమియో మాత్రలా? మరేవైనానా? నా ప్రయత్నాన్ని తను ముందే ఊహించిందా? ఆమె చేసిన పనికి ఆశ్చర్యం, ఆనందం అతనికి ఒక్కసారిగా కలిగాయి.

తన చిరకాల సంశయానికి సమాధానం బుల్లెమ్మ ఉత్తరం చూపించింది. బుల్లెమ్మ నవ్వుతూ అతని కళ్ళలో మెదిలింది. "బతికించి మరీ బతుకుతెరువు చూపించావా బుల్లెమ్మా!" అనుకున్నాడు. కళ్ళు చెమర్చాయి. భారమైన మనసుతో అక్కడ నుండి వచ్చేశాడు రామకృష్ణ" అని కథ చెప్పడం ముగించాడు వరప్రసాద్.

• • •

కథ విన్న అందరూ నిట్టూర్చారు. కొందరికైతే కాస్త అయోమయం కలిగింది. "ఎవరీ రామకృష్ణ? ఆయన కథ ఇప్పుడు మనకెందుకు చెప్పారు?" అనే ప్రశ్నలు వాళ్ళ ముఖాల్లో ప్రస్ఫుటంగా కనబడుతున్నాయి.

వరప్రసాద్ చిరునవ్వుతో "ఆమె అసలు పేరు వసంతమ్మ. అదిగో అక్కడ ఆ టేబుల్ పైన ఉన్న ఫోటో ఆమెదే! ఇవాళ ఆమె నూరవ పుట్టినరోజు కూడా. ఎంత క్లిష్ట పరిస్థితులైనా మనం గట్టిగా నిలబడితే కరిగిపోతాయనేది ఆమె ఉద్దేశ్యం. మనం నిలబడాలి, మరొకర్ని నిలబెట్టాలి అనేది ఆమె సందేశం. అదే కథా రూపంలో ఈరోజు మీ అందరితో పంచుకున్నాను" అన్నాడు వరప్రసాద్ ... అదే! రామకృష్ణ వరప్రసాద్.

అందరూ గట్టిగా కరతాళధ్వనులు చేశారు.

రచయిత సెల్ : 98492 39945

# యాష్‌గార్డ్‌... యమా రుచి!

వడియాలు ఎన్ని రకాలున్నా బూడిద గుమ్మడి వడియాల రుచే వేరబ్బా! అంతేకాదు పలు పోషకాలుండే బూడిద గుమ్మడితో పెరుగు పచ్చడి, కూటు, హల్వా, జ్యూసు .. ఎన్నో రకాలు చేసుకోవచ్చు. ఒకసారి ప్రయత్నించి చూడండి, గుమ్మానికి వేలాడదీసే గుమ్మడి రుచిలో ఇంత మొనగాడా అని ఆశ్చర్యపోతారు!

ఫుడ్‌ కోర్ట్‌



## హల్వా

### కావలసిన పదార్థాలు

బూడిద గుమ్మడి తురుము - 3 కప్పులు, పంచదార - ఒకటిన్నర కప్పులు, నెయ్యి - ముప్పావు కప్పు, యాలకుల పొడి - చిటికెడు, జీడిపప్పు, ఎండు ద్రాక్ష (నేతిలో వేగించిన) - 10 చొప్పున.

### తయారుచేసే విధానం

దళసరి అడుగున్న కడాయిలో బూడిద గుమ్మడి తురుము వేసి నీరంతా ఇగిరిపోయేవరకు సన్నని సెగపై వేగించాలి. తర్వాత పంచదార వేసి అడుగంటకుండా మిశ్రమం బంగారు రంగులోకి వచ్చేవరకు కలపాలి. ఇప్పుడు కాచిన నెయ్యి కలిపి ఐదు నిమిషాల తర్వాత జీడిపప్పు, ఎండుద్రాక్ష, యాలకుల పొడి చల్లి దించేయాలి. చల్లారిన తర్వాత ఫ్రిజ్‌లో పెట్టి తింటే బాగుంటుంది. ఫ్రిజ్‌లో వారం రోజులు, డీ-ఫ్రిజ్‌లో నెల రోజుల పాటు నిలువ ఉంటుంది.



## కూర

### కావలసిన పదార్థాలు

బూడిద గుమ్మడి - అరకేజీ ముక్క, పచ్చికొబ్బరి తురుము - అరకప్పు, ఆవాలు - ఒకటిన్నర టీ స్పూన్లు, కరివేపాకు - 4 రెబ్బలు, ఉప్పు - రుచికి తగినంత, నూనె - 2 టేబుల్‌ స్పూన్లు, ఎండుమిర్చి (అర టీ స్పూను నూనెలో వేగించిన) - 5, చింతపండు గుజ్జు - పావు టీ స్పూను.

### తయారుచేసే విధానం

(తొక్క, గింజలు తీసిన) బూడిద గుమ్మడి ముక్కలకు కొద్ది నీరు, ఉప్పు చేర్చి ఉడికించాలి. కొబ్బరి తురుము, ఎండుమిర్చి, చింతపండు గుజ్జు, అర టీ స్పూను ఆవాలు కలిపి మెత్తగా రుబ్బుకోవాలి. గుమ్మడి ముక్కలు మెత్తబడ్డాక కొబ్బరి మిశ్రమం వేసి చిన్న సెగమీద 10 నిమిషాలు ఉడికించి ఆవాలు, కరివేపాకు తాలింపు వేసి కలపాలి. ఈ కూర అన్నంతో రుచిగా ఉంటుంది.

## కూటు

### కావలసిన పదార్థాలు

ఉడికించిన బూడిద గుమ్మడి ముక్కలు - 2 కప్పులు, కొబ్బరి తురుము - అర చిప్ప, ధనియాలు, ఆవాలు, శనగపప్పు, బియ్యం, నువ్వులు - ఒక్కో టీ స్పూను చొప్పున, కరివేపాకు - 4 రెబ్బలు, ఎండు మిర్చి - 5, మెంతులు - పావు టీ స్పూను, పసుపు, ఇంగువ - చిటికెడు చొప్పున, చింతపండు - నిమ్మకాయంత, నూనె - 1 టేబుల్‌ స్పూను, బెల్లం - పావు కప్పు, ఉప్పు - రుచికి సరిపడా.

### తయారుచేసే విధానం

కొబ్బరి తురుము దోరగా వేగించాలి. కొద్ది నూనెలో ధనియాలు, శనగపప్పు, బియ్యం, నువ్వులు, ఎండు మిర్చి, మెంతులు వేగించి కొబ్బరి తురుము, చింతపండుతో పాటు బరకగా రుబ్బుకోవాలి. కొబ్బరి మిశ్రమం, బెల్లం, ఉప్పు బూడిద గుమ్మడి ముక్కల్లో వేసి సన్నని సెగపై ఉడికించి దించి విడిగా ఆవాలు, కరివేపాకుతో తాలింపు వేసి కలపాలి. ఈ కూటు అన్నం, చపాతీల్లోకి ఎంతో బాగుంటుంది.






## మీకు తెలుసా!



- 1820 వరకూ 'అంటార్కిటికా'ని ఎవరూ  చూడలేదు.
- బీవర్ జంతువు ముందు పళ్లు మరణించే వరకూ పెరుగుతూనే ఉంటాయి.
- చీమల్లో పద్నాలుగు రకాల చీమలు ఇతర చీమల దగ్గర బానిసలుగా పనిచేస్తున్నాయి.
- టర్కీ దేశంలో 'బ్యాట్‌మాన్' పేరు మీద ఒక నగరముంది.
- నిమ్మకాయలు కుక్కలకు విషతుల్య ఆహారం.
- విపరీతమైన కాలుష్యం కారణంగా చైనాలోని యాంగ్జె (Yangtze) నదినీళ్లు 2012లో ఎర్రగా మారిపోయాయి.




## పడిపోవడంలో రికార్డు

ఒక వస్తువును నెడితే దాని వెనుక మిగిలిన వస్తువులన్నీ వరుసగా పడిపోవడాన్ని మీరు చూసే ఉంటారు. పాశ్చాత్య దేశాల్లో అదో సరదా ఆట. పేరు డామినోస్. ఒక ఎలక్ట్రానిక్ వస్తువుల కంపెనీ అమెరికాలోని మ్యారీల్యాండ్‌లో గిన్నిస్ రికార్డు సాధనకు పన్నెండువందల మందిని పెద్ద హాల్లో నిలబెట్టింది. వాళ్లు ఒక్కొక్కరు తమ వెనకాల ఒక పరుపుతో నిలుచున్నారు. మొదటి వ్యక్తిని నెట్టగానే అతడు పరుపుతో పాటు రెండో వ్యక్తిపై పడిపోయాడు. అతడు మూడోవ్యక్తిపై... ఇలా పన్నెండు వందల మంది 13 నిమిషాలా 38 సెకన్లలో పరుపులపై పడి 'లార్జెస్ట్ హ్యూమన్ మ్యాట్రెస్ డామినోస్'గా గిన్నిస్ బుక్ రికార్డులకెక్కారు. రికార్డు సాధన తర్వాత ఆ పరుపులన్నీ ఇళ్లులేని నిరుపేదలకు అందజేయడం విశేషం.

## ఎగురుతూనే ఉంటుంది...!



సుదూర తీరాలకు ఎగిరే సముద్రపక్షుల్లో 'ఆల్బట్రాస్'కి ప్రత్యేక స్థానముంది. వేల కిలోమీటర్ల దూరాన్ని కొద్దిపాటి శ్రమతో చేరుకునే ఆల్బట్రాస్ పక్షి తన జీవిత కాలంలో ప్రయాణించే దూరాన్ని కచ్చితంగా లెక్కగట్టడం శాస్త్రజ్ఞుల వల్ల కూడా కాలేదు. ఓ అంచనా ప్రకారం అది జీవితకాలంలో ప్రయాణించే దూరం ప్రపంచాన్ని 100సార్లు చుట్టి వచ్చిన దానితో సమానం. చంద్రుడి దగ్గరకు పదిసార్లు వెళ్లి రావడంతో సమానం. 'డైనమిక్ సోరింగ్' (శక్తిని ఆదా చేసుకునేందుకు ఎగిరే కోణాన్ని మార్చుకోవడం), 'స్లోప్ సోరింగ్' (పర్వత శిఖరాన్ని తాకి పైకి లేచిన గాలివాటుని ఆధారంగా చేసుకుని శ్రమ లేకుండా ఎగరడం) టెక్నిక్కులతో అది రెక్కలు ఆడించకుండానే సుదూర ప్రయాణాలు చేయగలదు. ఏడాది కాలంలో ఈ పక్షులు లక్ష కిలోమీటర్లు ప్రయాణిస్తాయి. అయితే వీటికి ప్రయాణమంటే ఎందుకంత మక్కువో ఇప్పటికీ అంతుబట్టలేదు. ఆల్బట్రాస్ పక్షుల  జీవిత కాలం 40 నుంచి 50 ఏళ్లు. కేవలం జత కలవడానికి, గుడ్లు పెట్టడానికి మాత్రమే నేలపైకి దిగి వస్తాయి. ఇవి రెక్కలు విపార్చితే, ఆ పొడవు 12 అడుగులు ఉంటుంది.

## రంగువేయండి



1. లేత ఆకుపచ్చ, 2. ముదురు ఆకుపచ్చ, 3. తెలుపు, 4. పసుపు
5. నారింజ రంగు, 6. గులాబీ రంగు, 7. ఊదా రంగు

## దారి కనుక్కోండి



## చుక్కలు కలపండి





## కార్స్ 3

డిస్నీ, 'పిక్సర్' సంస్థల నుంచి కార్స్ సిరీస్‌లో వస్తోన్న మరో త్రీడీ యానిమేటెడ్ చిత్రం 'కార్స్ 3'. నెక్ట్స్ జనరేషన్ హై-టెక్ కార్లతో రేసులో పోటీ పడటానికి... అప్పటికే యాక్సిడెంట్ వల్ల రేసులు మానుకున్న 'లైటెనింగ్ మెక్‌క్వీన్' సిద్ధమవుతుంది. దానికి రేస్ టెక్నీషియన్ 'క్రజ్ రెమిరెజ్' సాయం చేస్తుంది. మరి తన ప్రత్యర్థి 'జాక్సన్ స్టార్మ్'పై 'లైటెనింగ్' విజయం సాధించిందా లేదా... అనేది వెండితెరపై చూడాల్సిందే! ఈ సిరీస్‌లో ఇప్పటి వరకూ వచ్చిన 'కార్స్', 'కార్స్ 2' ఒకదాన్నిమించి మరొకటి విజయం సాధించేసరికి 'కార్స్ 3' పై భారీ అంచనాలు నెలకొన్నాయి.




## నా బొమ్మ






**జి. మనోజ్ వంశీ**
7వ తరగతి,
శ్రీ భావన విద్యానికేతన్
క్రాంతినగర్,
విశాఖపట్నం

## బుచికి



# అనుగ్రహం

**9-15 ఏప్రిల్ 2017**

**డాక్టర్ పి.ఎ. రామన్**

### మేషం
**అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

వ్యవహారాల్లో ప్రతికూలతలెదురవుతాయి. ఖర్చులు అంచనాలను మించుతాయి. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. మంగళ, శని వారాల్లో ఏకపక్ష నిర్ణయాలు తగవు. సన్నిహితుల సలహా పాటించండి. మీ విషయాల్లో పెద్దల జోక్యం అనివార్యం. శ్రమాధిక్యతతో పనులు పూర్తి చేస్తారు. దంపతుల మధ్య స్పర్థలు తలెత్తుతాయి. ఆరోగ్యం పట్ల అశ్రద్ధ వహించరాదు.

### వృషభం
**కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

మీ సమర్థతను ఎదుటివారు గుర్తిస్తారు. అవకాశాలు కలిసివస్తాయి. ఖర్చులు అధికమైనా డబ్బుకి ఇబ్బంది ఉండదు. కుటుంబ విషయాలపై శ్రద్ధ వహిస్తారు. ఒప్పందాలకు అనుకూలం. మీ ఇష్టాయిష్టాలను లౌక్యంగా వ్యక్తం చేయండి. గురు, శుక్ర వారాల్లో అప్రమత్తంగా మెలగాలి. పిల్లల ఉన్నత చదువులపై దృష్టి సారిస్తారు. పరిచయం లేని వారితో జాగ్రత్త.

### మిథునం
**మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

అంచనాలు ఫలిస్తాయి. చక్కని ప్రణాళికలతో ముందుకు సాగుతారు. ఖర్చులు అధికం. ఆప్తులకు ముఖ్య సమాచారం అందిస్తారు. పరిచయస్తుల రాక ఇబ్బంది కలిగిస్తుంది. శనివారం నాడు పనులు సాగక విసుగు చెందుతారు. అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు. పెద్దలతో సంప్రదింపులు జరుపుతారు. మీ ప్రతిపాదనలకు ఆమోదం లభిస్తుంది.

### కర్కాటకం
**పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

ఈ వారం దుబారా ఖర్చులు చేస్తారు. చేతిలో డబ్బు నిలబడదు. పొగిడినవారే చాటుగా విమర్శిస్తారు. పిల్లల విజయం సంతోషపరుస్తుంది. ఉల్లాసంగా గడుపుతారు. వ్యవహార ఒప్పందాలకు అనుకూలం. స్థిమితంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. గృహ మరమ్మతులు చేపడతారు. అనవసర విషయాల్లో జోక్యం తగదు. స్వల్ప అస్వస్థతకు గురవుతారు.

### సింహం
**మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

అయినవారితో సంప్రదింపులు జరుపుతారు. ఖర్చులు అధికం. రుణదాతల ఒత్తిడి ప్రశాంతత లేకుండా చేస్తుంది. ఆత్మీయులు సాయం అందిస్తారు. పనులు హడావుడిగా సాగుతాయి. పిల్లల చదువుల గురించి ఆలోచిస్తారు. మీ శ్రీమతికి అన్ని విషయాలు తెలియజేయండి. అభియోగాలు, విమర్శలకు దీటుగా స్పందిస్తారు. ఒక సమాచారం ఉత్సాహాన్నిస్తుంది.

### కన్య
**ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

సౌమ్యంగా సమస్యల్ని పరిష్కరించుకోవాలి. ఆధిపత్యాన్ని ప్రదర్శించవద్దు. ఎదుటివారి అభిప్రాయాలకు విలువ ఇవ్వండి. పొదుపు దిశగా ఆలోచిస్తారు. పెద్ద మొత్తం ధనసహాయం తగదు. దంపతుల మధ్య ఏకాభిప్రాయం నెలకొంటుంది. నగదు, పత్రాలు జాగ్రత్త. వ్యాపారాభివృద్ధికి మరింతగా శ్రమించాలి. ఉద్యోగస్తులకు కొత్త చికాకులు తలెత్తుతాయి.

### తుల
**చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

సంప్రదింపులు ఫలిస్తాయి. ఒక వ్యవహారంలో డబ్బు అందుతుంది. అవసరాలకు ఇబ్బంది ఉండదు. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. పనులు వేగవంతమవుతాయి. మీ మాటతీరు అదుపులో ఉంచుకోవాలి. ఎవరినీ తక్కువ అంచనా వేయకండి. మంగళ, బుధ వారాల్లో మంచికి పోతే చెడు ఎదురవుతుంది. పెద్దల ఆరోగ్యం కుదుటపడుతుంది. కొత్త యత్నాలు ప్రారంభిస్తారు.

### వృశ్చికం
**విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

మనోధైర్యంతో వ్యవహరిస్తారు. సమర్థతకు గుర్తింపు లభిస్తుంది. ఎదుటివారిని ఆకట్టుకుంటారు. అవకాశాలను తక్షణం వినియోగించుకోండి. గురు, శుక్ర వారాల్లో పనుల్ని మొండిగా పూర్తి చేస్తారు. ఖర్చులు అధికం, ప్రయోజనకరం. చిన్నారులకు కానుకలందిస్తారు. మీ ప్రమేయంతో ఒక సమస్య సానుకూలమవుతుంది. పెట్టుబడులకు అనుకూలం.

### ధనుస్సు
**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

ఆర్థికంగా ఫర్వాలేదనిపిస్తుంది. విలాస వస్తువులు, వాహనం సమకూర్చుకుంటారు. మీ యత్నాలకు కుటుంబీకుల ప్రోత్సాహం ఉంటుంది. ముఖ్యమైన పనులు సకాలంలో పూర్తి కాగలవు. ఆత్మీయులతో ఉల్లాసంగా గడుపుతారు. మీ శ్రీమతి వైఖరిలో మార్పు సంతోషాన్నిస్తుంది. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. పిల్లల చదువులపై దృష్టి సారిస్తారు. పంతాలకు పోవద్దు.

### మకరం
**ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

అవిశ్రాంతంగా శ్రమిస్తారు. పరిస్థితులు అనుకూలిస్తాయి. ఖర్చులు పెరిగినా ఇబ్బంది ఉండదు. అవసరాలు నెరవేరుతాయి. పోగొట్టుకున్న పత్రాలు తిరిగి పొందుతారు. ఇంట్లో ప్రశాంతత నెలకొంటుంది. పిల్లల ఉన్నత చదువులను ఇష్టానికే వదిలేయండి. పనులు ముగింపు దశలో విసుగు కలిగిస్తాయి. నిరుద్యోగులకు శుభదాయకం. ఉద్యోగస్తులు ప్రలోభాలకు లొంగరాదు.

### కుంభం
**ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

బాధ్యతగా మెలగాలి. అనవసర విషయాల్లో జోక్యం తగదు. ఖర్చులు అంచనాలను మించుతాయి. పొదుపు డబ్బును ఖర్చు చేస్తారు. మంగళ బుధ వారాల్లో పనులు సాగవు. మీపై శకునాల ప్రభావం అధికం. ఆత్మీయుల ఆహ్వానం ఆలోచింపచేస్తుంది. బంధుమిత్రులతో సంప్రదింపులు జరుపుతారు. స్థిమితంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి.

### మీనం
**పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

పదవులు స్వీకరిస్తారు. పరిచయాలు బలపడతాయి. బాధ్యతగా వ్యవహరించాలి. సాధ్యంకాని హామీలివ్వవద్దు. విలాసాలకు బాగా వ్యయం చేస్తారు. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. పనులు నిదానంగా పూర్తవుతాయి. ఆది, గురు వారాల్లో బాధ్యతలు అప్పగించవద్దు. పరిచయం లేని వారితో జాగ్రత్త. విద్యార్థులు చక్కని ఫలితాలు సాధిస్తారు. ప్రకటనలను విశ్వసించవద్దు.

ఈ వారం కవిత

# విరుద్ధాల అలికిడి




**మ**చ్చ కనిపించినప్పుడల్లా
గాయం జ్ఞాపకమొస్తుంది.
గాయం మానుతుందనే భరోసాకి
గుర్తుగానూ మచ్చ నిలిచిపోతుంది.

వానొచ్చిన ప్రతిరోజూ
మోకాల్లోతు బురదా, చిల్లులు పడ్డ
గొడుగులా కంపించే మా పూరిల్లూ
సహజంగా గుర్తుకొస్తాయి. అంతే సహజంగా
తెల్లారాక గట్లమీదా, పుట్లమీదా
నేలను చీల్చుకొని బయటికొచ్చిన
పుట్టగొడుగులు వానకానుకల్లా మెరిసిపోతాయ్.

ఒకపక్క చీకట్లో భయం గుడ్లు పెట్టటం
మరోపక్క చీకటి అంచుల్లో దట్టంగా పొంచి ఉన్న వెలుగు
భుజం తట్టటం ...

అనుకూలతకీ అననుకూలతకీ మధ్య
అనంత కాలం నుంచీ నడుస్తున్న గతి తార్కిక సంవాదమేనా
జీవితమంటే.
విరుద్ధాల ఉమ్మడి అలికిడేనా సత్యమంటే!

**- జి.లక్ష్మీనరసయ్య, 92465 72073**

# భర్తృహరి గుహలు

**"ఆరంభింపరు నీచమానవులు, విఘ్నాయాస సంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురట విఘ్నాయత్తులై మధ్యముల్..."**



అనే పద్యం చాలామందికి తెలిసిందే. ఇది ఏనుగు లక్ష్మణ కవి పద్యం. కానీ సంస్కృతంలో భర్తృహరి శ్లోకానికి తెలుగు అనువాదం. కవి, పండితుడు, యోగి, తపస్వి అయిన భర్తృహరి గుహలు మధ్యప్రదేశ్-ఉజ్జయినీ నగరంలో ఉన్నాయి. ప్రాచీన కాలంలో అవంతి నగరంగా ప్రసిద్ధికెక్కిన ఉజ్జయినిలో పండితుడు తపస్సు చేసిన, కవిత్వం రాసిన ప్రదేశం ఇప్పటికీ చెక్కు చెదరకుండా ఉండడం విశేషం. ఉజ్జయినీ నగరం శిప్రానది ఒడ్డున ఉంది. స్కంద పురాణంలో శిప్రానది ప్రస్తావన కనిపిస్తుంది. భర్తృహరి నీతి శతకం, శృంగార శతకం, వైరాగ్య శతకాలు రాశాడు. ఇవి ఆంగ్లం, గ్రీకు, జర్మన్, ఫ్రెంచ్, డచ్ భాషలలోకి అనువాదం అయ్యాయి.

భర్తృహరి గురించి రెండు మూడు కథలున్నాయి గానీ చైనా యాత్రికుడు ఈత్సింగ్, పాశ్చాత్యుడు వింటర్ నిట్స్ల ప్రతిపాదనల ఆధారంగా భర్తృహరి కాలాన్ని క్రీ.శ. 650గా నిర్ణయించారు. భర్తృహరి రాజా విక్రమాదిత్యుని అన్న అనీ, తన భార్య పింగళ దుష్ప్రవర్తనను సహించలేక విరక్తుడై తపస్విగా మారి శతకత్రయం రాశాడనీ ఒక కథనం. ఎక్కువ మంది దీనిని విశ్వసిస్తున్నారు. ఉజ్జయినిలో విక్రమాదిత్యుని విగ్రహం కూడా ఉంది. భర్తృహరి గోరక్షనాథుడనే శివసిద్ధయోగి శిష్యుడు అనీ, నాథ సంప్రదాయమనే యోగ సంప్రదాయ ప్రవర్తకుడనీ మరో కథనం. దీనికి ఆధారంగా సమీపంలో మత్స్యేంద్రనాథ సమాధి ఉంది.

భర్తృహరి గుహల లోపలికి వెళ్ళడానికి శ్రమపడాలి. చిన్న చిన్న ద్వారాలు, సందులు ఉంటాయి. పైకప్పు కూడా తలకి తగిలేట్టు ఉంటుంది. లోపలికి వెళ్తే భర్తృహరి విగ్రహం కనిపిస్తుంది. దీనికి పూజలు చేస్తుంటారు. భర్తృహరి విగ్రహం పైకప్పు మీద చేతి గుర్తులుంటాయి. భర్తృహరి ఘోర తపస్సును భగ్నం చేయడానికి దేవేంద్రుడు పెద్ద రాయి విసిరితే ఒక చేత్తో దానిని ఆపాడనీ, అవి భర్తృహరి చేతిముద్రలనీ ఐతిహ్యం. ఈ గుహల నుంచి చార్‌ధామ్‌కి సొరంగ రహదారు లున్నాయనీ, ఇప్పుడు మూసివేశారనీ స్థానికులు కథలుగా చెప్తారు. గుహలలో తపస్సిద్ధి పొందితేనే గానీ కవి పండితులకి ఆదరణ లభించదేమో!

**- ద్వా.నా. శాస్త్రి**



## అనుభవ పాఠాలు

రైతులెవ్వరూ వ్యవసాయ కళాశాలలో పట్టా పుచ్చుకుని పొలంలో దిగరు. విత్తు నాటే ముందు ఏ పుస్తకం పేజీలూ హడావుడిగా తిప్పరు. అనుభవమే పాఠం. అలాంటి ఎన్నో పాఠాలను పోగేసి ఒక పుస్తకంగా గుదిగుచ్చి అందించారు పతంగి రాంబాబు. వ్యవసాయానికి సింబల్‌గా ఉరితాళ్ళు కనిపిస్తున్న కాలంలో రైతుకి ధైర్యం చెప్పే కథనాలు ఇవి. మార్కెట్ మాయా వలయంలో పడి నేలనీ, పంటనీ, తినే ప్రజలనీ రోగగ్రస్థం చేస్తున్నారు. రసాయన ఎరువులు, పురుగు మందుల విచ్చలవిడి వినియోగం దుష్ఫలితాలను కళ్లకు కడుతూనే, ప్రత్యామ్నాయ దారుల్లో ప్రయాణిస్తున్న రైతులను పరిచయం చేశారు. మందుల, ఎరువుల వ్యవసాయం వల్ల నిస్సారమవుతున్న భూమి గురించి వివరిస్తూనే కేవలం కాస్త లోతులోని మట్టిని తవ్వి తీసి ఎండబెట్టి ఎరువుగా వాడి భూసారాన్ని పెంచిన కీసర సమీపంలోని కుందన్‌పల్లి చింతల వెంకటరెడ్డి ప్రయోగానుభవాలు అద్భుతం. ఆయన స్ఫూర్తితో అధిక దిగుబడులు సాధిస్తున్న రైతుల గురించీ సవివరమైన కథనాలున్నాయి. విత్తనాలకోసం దుకాణాలకు పరుగులు తీయకుండా దేశీ వంగడాలతో మంచి ఫలితాలు సాధించవచ్చని కృష్ణాజిల్లా పినగూడూరు లంకలో ఆరెకరాల వరి సేద్యంతో నిరూపించిన మేకపోతుల విజయరామ్ చెప్పిన సంగతులు అనుసరణీయం. కురిసిన వాన చినుకులన్నీ పొలంలోనే ఒడిసి పట్టుకుని సేద్యం చేస్తున్న నల్లగొండ జిల్లా రైతులు పరకాల జోగేశ్వరరావు, కంచర్ల మధుసూదన్‌రెడ్డిల ప్రయత్నాలు వివరించే కథనం ఆసక్తికరం. డ్రాగన్ ఫ్రూట్, ఆపిల్‌బేర్, లీచీ పండ్లను మన నేల మీదా పండించవచ్చని నిరూపించిన రైతులను ఈ పుస్తకంలో పలకరించవచ్చు. ఆత్మహత్యలను ఆపేది ప్రకృతి సేద్యమే అంటున్న సుభాష్ పాలేకర్‌తో ఇంటర్వ్యూ ఎన్నో కొత్త విశేషాలు వెల్లడిస్తుంది. ఎందరో రైతు శాస్త్రవేత్తల ఆవిష్కరణలను సైతం రాంబాబు పరిచయం చేశారు. 'ప్రకృతి వ్యవసాయానికి పెద్ద బాలశిక్ష' గా భావిస్తూ ఈ పుస్తకాన్ని ఎంతో అందంగా రంగుల్లో ముద్రించి అందించారు కె.క్రాంతి కుమార్ రెడ్డి. ఆరోగ్యకరమైన సమాజం కోసం ఆయన పడుతున్న తపన అంతా ఈ పుస్తకాన్ని తీర్చిదిద్దిన తీరులోనే వెల్లడవుతుంది.

**- ఉమ**



**సాగుబడి** - పతంగి రాంబాబు,
**పేజీలు :** 320, **వెల:** రూ.400
**ప్రతులకు:** 9603214455

## వలపు కోసం ...

కల్పితమైనా ... కథనంతో ఆకట్టుకోవటంలో ఆర్.కె.నారాయణ్‌కు సాటి రాగలవారు లేరు. భారతీయ ఆంగ్ల రచయితగా ఆయన సుపరిచితులు. అతి సామాన్యంగా ఆరంభించి, మధ్యలో పరుగులు పెట్టించి, చివర్లో ఉత్కంఠ కలిగించడంలో ఆయన దిట్ట. ఈ నవల విషయానికి వస్తే బామ్మ, మనవడు, అతను వలచిన ఆమె చుట్టూ తిరుగుతుంది. అంతస్సూత్రం మహాత్మా గాంధీ. క్విట్ ఇండియాతో మొదలై దేశానికి స్వాతంత్ర్యం రావడం, గాంధీజీ మరణం వరకు చెప్పినప్పటికీ మనవడు, అతని ప్రేమకు ప్రాధాన్యం ఇచ్చారు. తను ప్రేమించిన అమ్మాయి గాంధీ అనుయాయి. ఆమె ప్రేమ పొందాలంటే గాంధీని అనుసరించడం మినహా మరో మార్గం లేదు ఆ యువకుడికి. ఆ ప్రయాణంలో చోటుచేసుకున్న మలుపులు ఆసక్తికరంగా ఉంటాయి. వృత్తిరీత్యా ఫిజిక్స్ అధ్యాపకుడైన అనువాదకుడు తొలి యత్నంలోనే మంచి మార్కులు కొట్టేశారు.

**- మద్దిపట్ల మణి**



**మహాత్ముని కోసం నిరీక్షణ,** ఆర్.కె.నారాయణ్
**అనువాదం :** వేమవరపు భీమేశ్వరరావు
**పేజీలు:** 256, **వెల:** రూ.150
**ప్రతులకు:** అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు

కొత్త పుస్తకాలు

## చరిత్ర శోధన

సింధూలోయ నాగరికత, పురాణాల్లో చెప్పబడ్డ అయోధ్య, లంకాపురి, పాంచాల వంటి నగరాలు, నదులు ... ఇప్పుడు ఏ రూపంలో ఎక్కడున్నాయి? వేదాల్లో, ఉపనిషత్తుల్లో ఏముంది? గాయత్రి మంత్రం, సనాతన ధర్మాల పూర్వాపరాలు వంటి ఎన్నో అంశాలను పరిశోధన పరిధిలోకి తీసుకుని రాసిన గ్రంథం ఇది. పురాణేతిహాసా ల్లోని పాత్రలకు, స్థలాలకు చారిత్రకత కల్పించాలనే దృఢ సంకల్పం కనపడుతోంది ఇందులో. చరిత్ర పరిశోధకులకు గైడ్‌గా ఉపయోగపడే మంచి పుస్తకం ఇది.



**ప్రాచీన భారతీయులకు అక్షర సుమాంజలి**
డి.వి.ఎస్. జనార్దన్ ప్రసాద్
**పేజీలు:** 215, **వెల :** రూ.350
**ప్రతులకు :** 98663 57268

ఇవీ వచ్చాయి

**ఆంధ్ర సాహిత్యములో బిరుదనామములు**
రచన : కోడీహళ్లి మురళీమోహన్
**పేజీలు :** 146, **వెల :** రూ.60
ప్రతులకు : 97013 71256

**సమూహం**
(బీసీ అస్తిత్వవాద యువ కవిత్వం)
సం. : డా. చింతం ప్రవీణ్‌కుమార్
**పేజీలు :** 128, **వెల :** రూ.100

**పరోపకారార్థం** (కథలు)
రచన : పంజాల జగన్నాథం
**పేజీలు :** 50, **వెల :** రూ.100

**రేయి వీడని నక్షత్రం** (కథాసంపుటి)
రచన : కొండవలస శ్రీనివాసరావు
**పేజీలు :** 220, **వెల :** రూ.250
ప్రతులకు : ప్రముఖ పుస్తక కేంద్రాలు

**ప్రమీలా త్రిశతి**
రచన : ఆచార్య మసన చెన్నప్ప
**పేజీలు :** 100, **వెల :** రూ.50
ప్రతులకు : 98856 54381

**ఏడడుగుల బంధం** (కవితా సంకలనం)
సం. : గుదిబండి వెంకటరెడ్డి
**పేజీలు :** 108, **వెల :** రూ.100
ప్రతులకు : 98498 82783

**భారతీయ సంస్కృతిలో వనితామణులు**
రచన : ఆచార్య గోగినేని యోగప్రభావతీ దేవి
**పేజీలు :** 96, **వెల :** రూ.60
ప్రతులకు : 99626 92662

**శ్రీ ప్రసన్నాంజనేయస్వామి దేవస్థానం**
రచన : కరణం వివేకానందమూర్తి
**పేజీలు :** 75, **వెల :** అమూల్యం
ప్రతులకు : 94903 62989

**సోమేపల్లి పురస్కార కథలు-2**
కూర్పు : ఎస్.వెంకటసుబ్బయ్య, సిహెచ్.ప్రకాష్
**పేజీలు :** 184, **వెల :** రూ.100
ప్రతులకు : 92474 75975

## హెపటైటిస్ కట్టడి హోమియోతో సాధ్యం

**హెపటైటిస్** వైరస్...మానవాళిని భయపెడుతున్న వైరస్‌లలో ఇదొకటి. దీని మూలంగా కాలేయంలో కణాలు వాచిపోయి ఫైబ్రోసిస్, సిర్రోసిస్‌కు దారితీస్తుంది. దీంతో కాలేయ పనితీరు మెల్లగా తగ్గి ప్రాణాంతకంగా మారుతుంది. ఈ వ్యాధి వచ్చిన తర్వాత శాశ్వత పరిష్కారాన్ని చూపే చికిత్స ఇతర వైద్యవిధానాలలో లేదు. కానీ హోమియో వైద్యంలో అద్భుతమైన చికిత్స ఉంది.

**ఇవీ కారణాలు :** ఎక్కువ మందితో సెక్సువల్ కాంటాక్ట్స్ పెట్టుకోవడం, అపరిచితుల నుంచి సేకరించిన రక్తం అంటే హెపటైటిస్ వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, స్వలింగ సంపర్కం, ఒకరు వాడిన సిరంజీలు మరొకరు వాడటం వల్ల కూడా హెపటైటిస్ వచ్చే అవకాశం ఉంటుంది. తల్లి గర్భవతిగా ఉన్నపుడు ఈ వ్యాధి సోకినట్లయితే కడుపులోని బిడ్డకు కూడా సంక్రమించే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు :** ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. తరువాత నెమ్మదిగా కామెర్లు మొదలవుతాయి. దీంతో పాటు చర్మంపై దద్దుర్లు కనిపిస్తాయి. హెపటైటిస్ బి వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. దీన్ని క్రానిక్ హెపటైటిస్ అంటారు.

**హోమియో చికిత్స :**

హెపటైటిస్ బి, సి వైరస్‌లు కాలేయంలో మల్టిపుల్ అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది. దీన్ని రెప్లికేషన్ అంటారు. ఈ రెప్లికేషన్ అయ్యే పద్ధతిని హోమియోపతి మందుల ద్వారా అడ్డుకోవచ్చు.

## హెచ్‌ఐవి, హెర్పిస్‌లకు దీటైన వైద్యం

**హెచ్ఐవి** సోకితే మరణం తప్పదనే భావన ఇప్పటికి చాలా మందిలో ఉంది. నిజానికి హోమియోలో హెచ్‌ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్‌ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్‌ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

**హెర్పిస్**

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

**హోమియో చికిత్స**

హోమియో మందులతో రోగనిరోధక శక్తి బలపడుతుంది. తద్వారా హెచ్‌ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు కూడా హోమియో చికిత్సపనిచేస్తుంది. హోమియో చికిత్స మూల కారణాన్ని తొలగిస్తుంది.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
**గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్**
**మాస్టర్స్ హోమియోపతి**
**అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి**
**ఫోన్ : 7842 106 106, 9032 106 106**
**V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి**
**సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి**
**10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.**



## తల తిరుగుతుంటే...!

**తల** తిరగడం అనేది ఈ ఆధునిక యుగంలో సాధారణ సమస్యగా మారింది. కానీ అది దీర్ఘకాలికంగా బాధిస్తున్నప్పుడు అది రావడానికి కారణాలు కచ్చితంగా కనుక్కుని చికిత్స ఇవ్వాలి

**సెంట్రల్ వర్టిగో :** కొన్నిసార్లు తలతిరగడానికి మెదడులోని సమస్యలు లేక నాడీమండలం కారణం కావచ్చు. ఈ కారణాల వల్ల తలతిరిగితే సెంట్రల్ వర్టిగో అంటారు.

**1) సర్వైకల్ స్పాండిలోసిస్ :** మెడనొప్పి ఉన్న వారికి నొప్పితో పాటు తలతిరగడం కూడా కొంతమందిలో ఉంటుంది. మెడ తిప్పినపుడు తలతిరిగి కొన్నిసార్లు తూలినట్టు అవుతుంది. వెన్నెముక ఎముకల మధ్యలో ఉండే డిస్క్ దెబ్బతిని నరాల మీద ఒత్తిడి వల్ల ఇలా జరుగుతుంది.

**2) పార్శ్వపునొప్పి :** ఈ వ్యక్తులలో ఒకవైపు తలనొప్పితో పాటు కొన్ని సార్లు తలతిరగడం కూడా ఉంటుంది. నొప్పితో పాటు వికారం, వాంతులు వంటి లక్షణాలుంటాయి. శబ్దాన్ని, కాంతిని భరించలేరు.

**పెరిఫెరల్ వర్టిగో :** ఇక్కడ తలతిరగడం చెవి సమస్యల వల్ల వస్తుంది.

**1) బిపిపివి (బినైన్ పారాక్సిస్మల్ పొజిషనల్ వర్టిగో):** 32 శాతం మందిలో తలతిరగడానికి ప్రధాన కారణం ఇదే.

**2)మినియర్స్ డిసీజ్ :** ఈ సమస్యలో తలతిరగడం, చెవిలో హోరుమని శబ్దాలు, వినికిడి తగ్గడం లాంటి మూడు లక్షణాలుంటాయి.

**హోమియో చికిత్స :** తలతిరగడం ఎందువల్ల వస్తుందో తెలుసుకోవాలి. ఈ లక్షణాలతో పాటు రోగి మానసిక, శారీరక లక్షణాలను తెలుసుకుని చికిత్స ఇవ్వాలి.

## సుఖవ్యాధులు ఇక బాధించవు

**గనేరియా :** యుక్తవయస్సు వారిలో ఎక్కువగా కనిపిస్తుంది. జననాంగాలు, నోరు, ఆనస్ వరకు వ్యాప్తి చెందుతుంది. భాగస్వామిలో ఒకరికి ఈ వ్యాధి ఉన్నా మరొకరికి సంక్రమిస్తుంది. గర్భిణిగా ఉన్నప్పుడు గనేరియా ఉంటే పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. మూత్రంలో మంట, ద్రవం కారడం, దుర్వాసన వంటి లక్షణాలు కనిపిస్తాయి. స్త్రీలలో నెలసరి మధ్యలో రక్తస్రావం, మూత్రనాళంలో మంట, గర్భకోశ వ్యాప్తి ద్వారా సంతానలేమి, అండాశయ వాపు, గర్భకోశ వాపు, ట్యూబులు మూసుకోవడం జరుగుతుంది.

**సిఫిలిస్ :** శృంగారం ద్వారా వ్యాపించే మరో వ్యాధి ఇది. యోని, మలద్వారం,మూత్రాశయం, పురుషాంగం, నోరు వంటి ప్రదేశాల్లో వచ్చే అవకాశం ఉంటుంది. జబ్బు వచ్చినట్లు తెలియకుండానే ఇతరులకు వ్యాప్తి చెందడం జరుగుతుంది. పుండ్లు ఒకటి లేక రెండు, మూడు ఉండవచ్చు. పుండ్లు తగ్గినట్లే తగ్గి మళ్లీ తిరగబెడతాయి.

**ట్రైకోమోనియాసిస్ :** శృంగారం ద్వారా వ్యాపించే ప్రొటోజువ పారసైట్ వ్యాధి. మూత్రకోశ ం , జననాంగాలకు వ్యాప్తి చెందుతుంది. యోని, మూత్రనాళంపై ప్రభావం ఎక్కువగా ఉంటుంది. పురుషాంగం, యోని భాగంలో మంట, దురద, కలయికలో ఇబ్బంది, మూత్ర విసర్జన సమయంలో బాధ వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**హోమియోవైద్యం :** హోమియో వైద్యవిధానం ద్వారా సుఖవ్యాధులను సమూలంగా తరిమేయవచ్చు. ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా చికిత్స అందించవచ్చు. రోగి శారీరక లక్షణాలు, మానసిక స్థితిని బట్టి చికిత్స అందించడం వల్ల మంచి ఫలితం ఉంటుంది. అనుభవజ్ఞులైన వైద్యుల పర్యవేక్షణలో చికిత్స తీసుకుంటే సుఖవ్యాధులు సమూలంగా పోతాయి.

ADVT

